సాధన గ్రంథమండలి 40

# సంకీర్తన మీమాంస

శ్రీ [illegible]

[illegible] శ్రీ [illegible]

శ్రీ కుందుర్తి వేంకట నరసయ్య

సంపాదకుడు : [illegible]

[illegible]

ప్రకాశకులు

సాధన గ్రంథమండలి,

తెనాలి.

వెల 1—0—0



గ్రంథాను వాదకుడు

శ్రీ కుందుర్తి వెంకట నరసయ్య.

శ్రీః

# ఉపోద్ఘాతము

శ్రీ త్రిపురారిభట్ల వీరరాఘవస్వామిగారు
(తెనాలి, సంస్కృతకళాశాలా, పూర్వ ఉపాధ్యాయులు)

ఆత్మవిచారణ మనాదిసిద్ధమైనది. సృష్ట్యాదినుండి నేటి వరకు మన భారతదేశములో అది ఆబాలగోపాలము అంతో ఇంతో ఆలోచనములోను, ఆచరణములోను, అనుభవము లోను ఉండియున్నది. ఆత్మజ్ఞులైన మహానుభావులు నాటి నుండి నేటివరకు పవిత్రమైన భారతదేశమును సుపవిత్రము చేయుచు విరాజిల్లుచున్నారు.

ప్రాణికోటికి ఆత్మ అతిసన్నిహితమైనది. ప్రాణులకు సుషుప్తియందు నిత్యమును ఆత్మభావానుభూతి సంభవించుచునే యున్నది. అయినను అజ్ఞానశబలితమగు జీవభావమునొంది యుండుటచే మన కది అతిసుగూఢమగుచున్నది. అతిదూర మగుచున్నది. అందుచేతనే పురుషపుంగవు లనేకులు బ్రహ్మ చర్యాది నియమవ్రతులై బహుకాలము తపోధ్యానాదికము లాచరించి మాయాయవనికను తొలగించుకొని ఆత్మస్వరూపము నవగతముచేసికొని దానితత్త్వమును నెల్లడించినారు. ఆత్మ స్వరూపావగతికి మార్గము లుపదేశించినారు.

అపారమైన సంసారములో జీవకోటికి ఆత్మకన్న ప్రియ తమమైనది మరియొకటిలేదు. తద్విషయమై బృహదారణ్య కోపనిషత్తులో యాజ్ఞవల్క్యుడు మైత్రేయి కిట్లు ఉపదేశించి

నాడు—"న వా అరే పత్యుః కామాయ పతిః ప్రియో భవతి, ఆత్మనస్తు కామాయ. పతిః ప్రియో భవతి। నవా అరే జాయాయై కామాయ జాయా ప్రియా భవతి। ఆత్మనస్తు కామాయ జాయా ప్రియా భవతి।......న వా అరే సర్వస్య కామాయ సర్వం ప్రియం భవతి, ఆత్మనస్తు కామాయ సర్వం ప్రియం భవతి। ఆత్మా వా అరే ద్రష్టవ్యః శ్రోతవ్యో నిదిధ్యాసితవ్యో మైత్రేయ్యాత్మని ఖల్వరే దృష్టే, శ్రుతే, మతే, విజ్ఞాత ఇదం సర్వం విదితమ్।"

దీని తాత్పర్యము— పతియందలి కాంక్షచేత పత్నికి పతి ప్రియుడగుట లేదు. ఆత్మమీది కాంక్షచేతనే పతి ప్రియుడగుచున్నాడు. భార్యయందలి కాంక్షచేత భర్తకు భార్య ప్రియురాలగుట లేదు. ఆత్మమీది కాంక్ష చేతనే భార్య ప్రియురాలగుచున్నది. అట్లే పుత్రులు, విత్తము పశువులు మొదలైనవి. సర్వమందలి కాంక్షచేత సర్వము ప్రియమగుట లేదు. ఆత్మమీది కాంక్షచేతనే సర్వము ప్రియమగుచున్నది. కనుక లోకములోని సమస్తవస్తువుల యందలి కాంక్షయు, ప్రీతియు వస్తుగతములుకావు. కేవలము ఆత్మగతములు. ఆత్మమీద మనకుప్రీతి కాంక్షలుండుటచేతనే, వస్తువులందు ప్రీతి కాంక్షలు కలుగుచున్నవి. అందుచేత ఆత్మయే మనకు ప్రియమైనది కాంక్షణీయమైనది. తత్కారణమున ఆత్మయే ద్రష్టవ్యమైనది. శ్రోతవ్యమైనది. మంతవ్యమైనది. నిదిధ్యాసితవ్యమైనది. ఆత్మనుచూచి, విని, మననముచేసి తెలిసికొనినచో సర్వము సమస్తబ్రహ్మాండము తెలిసినదగును. సమస్త కాంక్షలు సిద్ధములగును.

ఆత్మ కామత్వమే ఆప్తకామత్వము. ఆత్మయే బ్రహ్మ. జీవాత్మ పరమాత్మలకు భేదములేదు. ఆనందము ఆత్మస్వరూపము. ఆత్మవేత్తకు పరము ప్రాప్తించునని శ్రుతులు చెప్పుచున్నవి. అదే స్వస్వరూపావగతి. అదే పరప్రాప్తి. అదే మోక్షము. అదే నిరతిశయసుఖము. అదే బ్రహ్మానందము.

జీవకోటికి ప్రవృత్తి అతిసహజమైనది. ప్రవృత్తియే సర్వకామనలకును మూలము. కామనను బట్టి కర్మాచరణమును, కర్మఫలితమునుబట్టి, సంసార బంధమును కలుగుచున్నది. బంధము సుఖదుఃఖరూపమైనది. సుఖరూపము బంగారు సంకెలలవంటిది. దుఃఖరూపము యినుపసంకెలవంటిది. ఏదైననూ బంధమే దేనినైననూ అనుభవించుటకు జననమరణాది దుఃఖము లొందుచుండవలసినదే. తత్ఫలితముగ ప్రతి మానవుడును సంసారావర్తములోబడి, పరిభ్రమించుచు దుఃఖనివృత్తికిని, సుఖప్రాప్తికిని నిరంతరము ప్రయత్నించుచున్నాడు. తత్ప్రయత్నములో సంసారముఅనిత్యమనియు, దుఃఖభూయిష్టమనియు, దుఃఖకారణము అజ్ఞానమనియు, అజ్ఞానస్వరూపము అహంకార మమకారములనియు, వాని విజృంభణమే కామక్రోధాదులనియు గ్రహించుచున్నాడు. గ్రహించి అరిషడ్వర్గమును అరికట్టి, అహంకార మమకారాభిమానము నణచిపెట్టి దుఃఖనివృత్తికని, శుభప్రాప్తికిని, అజ్ఞానాస్తమయమునకును వివేకోదయమునకును, జ్ఞానప్రకాశమునకును, ఆనందావాప్తికని ఉపాయముల నన్వేషించుచున్నాడు, ఉత్తమోపాయము యీశ్వరారాధనమేయని తెలిసికొనుచున్నాడు. ఈశ్వరప్రణిధానమువల్లతప్ప, బ్రహ్మానందానుభూతి కలుగదని, నిశ్చయించుకొనుచున్నాడు.

ఈశ్వరానుగ్రహప్రాప్తికిని, తన్మూలమున తత్స్వరూపావాప్తికిని, సాధనము లనేకములున్నవి. సాధకుడు వారి వారి విజ్ఞానమును వివేకమును నిగ్రహమును అభిలషించిని అనుసరించి, సాధనముల నవలంబించుచుందురు. వైరాగ్యసంపన్నులయిన ధీమంతులు సర్వసంగపరిత్యాగము చేసి, జ్ఞానమార్గము నవలంబించి. బ్రహ్మవిచారణ చేయుచుందురు. నిగ్రహసంపన్నులు బ్రహ్మచర్యాది నియమములాచరించుచు, యోగమార్గ మవలంబించి, సమాధినిష్ఠ నభ్యసించుచుందురు. ఈ రెండును నివృత్తిమార్గములు. ప్రవృత్తిమార్గములలో నుండి కొందరు వివేకధురీణులు ఫలాభిసంధిపరిత్యజించి, కర్మవీరులై మానవసేవారూపమున, యీశ్వర పరిచర్య చేయుచుందురు. మరికొందరు విజ్ఞానవంతులు ఉపాసనామార్గ మవలబించి, ధ్యాననిష్ఠులై యీశ్వరప్రణిధానము చేయుచుందురు. మరికొందరు భక్తిమార్గము నవలంబించి, ప్రేమనిష్ఠులై, యీశ్వరనామ సంకీర్తన చేయుచుందురు.

ఈ మార్గములలో కొన్ని సాక్షాత్సాధనములు. కొన్ని పరంపరాసాధనములు. మార్గభేదమందు తరతమభావమున్నను, అన్నియు యీశ్వరానుగ్రహప్రాప్తికి సాధనములే. నామసంకీర్తనేతర సాధనములు కొలదిగనో, గొప్పగనో విజ్ఞాన వివేక నిగ్రహవైరాగ్య విశేషములను అపేక్షించును. నామసంకీర్తన సాధనము ప్రేమ ప్రధానమైనదగుటచే, పండితపామరుల కందరికిని సాధ్యమైనది. అంతేకాక రాగద్వేషాదులు ప్రబలియున్న యీ కాలములో ప్రేమైక సాధనమయిన నామసంకీర్తనము ఆవశ్యకమయినది,

నామసంకీర్తన విధానమును, భక్తవర్యుడగు శ్రీ సుదర్శనుడు హిందీభాషలో సంకీర్తనమీమాంస అను పేరుతో చక్కగా వివరించి, రచించినాడు. భక్తితత్త్వమును తద్విధానమును వివరించిన గ్రంథములు సంస్కృతమున చాలగలవు. వానిలోని సారమును గ్రహించి, భక్తితత్త్వమును ప్రదర్శించుటయేగాక, శ్రీ సుదర్శనుడు స్వానుభవముచే సంకీర్తనాదులందలి గుణదోషములను తత్సాధకుల మంచిచెడ్డలను చక్కగా వెల్లడించినాడు. అవి సంకీర్తనసాధకులకు అమూల్యములు.

సంకీర్తనమీమాంసను తెలుగులోని కనువదించి, శ్రీ కుందుర్తి వేంకటనరసయ్య తెలుగు సాధకుల ఆదరమునకు పాత్రుడైనాడు. సాధనగ్రంథమండలివారు యీగ్రంథమును ప్రచురించి, తెలుగువారి కెంతో ఉపకరించినారు, ఇట్టి గ్రంథము లింకనూ ప్రచురించి, తెలుగువారి కింకనూ ఉపకరింతురుగాక. ఇతి శుభాశీః.

(సం) శ్రీపెరుంబూదూరుభట్ట వీరరాఘవస్వామి.

శ్రీరామ

# ప్రస్తావన

నేను సంకీర్తన మీమాంసను మొదట హిందీభాషలోఁ జదివితిని. దీనిని హిందీలో రచించిన 'సుదర్శన్'గారు కొన్నాళ్లు 'సంకీర్తన్' అను హిందీపత్రికకు సంపాదకులు. వారికిని నాకును అదివఱకే పత్రపరిచయమున్నను శ్రీ ప్రభుదత్తజీ బ్రహ్మచారిగారు విరాట్సంకీర్తన యజ్ఞమునకు మమ్మెల్ల నాహ్వానించిన సందర్భమున నచ్చటకు వెళ్లినపుడే 'సుదర్శన' దర్శనమైనది. మీమాంసా సూత్రములు దేవభాషలోనున్న బాగుండునని నేను వారికి సలహా నీయఁగా 'అట్టిది మీబోటి వారెవరైనఁ జేయవచ్చు'నని వారు పలికిరి. వారి యనుజ్ఞచే నాకున్న అతిస్వల్పమగు సంస్కృతజ్ఞానము నాధారముగఁ గైకొని సూత్రములను సంస్కృతమున రచించి మొట్టమొదట మా మోక్షసాధనిలో 1943 మే నెలలోఁ బ్రచురించితిమి. సుదర్శన్‌గారు సంస్కృతసూత్రములను గాంచి చాల ఆనందించి మీమాంస వ్యాఖ్యానముతో ననువదింపఁ గోరిరి. వారి కోరిక ననుసరించి మిగిలిన వ్యాఖ్యాన భాగమును గూడ తెలుఁగులోనికనువదించి నేఁటికి ప్రకటింపఁగలుగుచున్నాను.

ఈ సూత్రములను బరిశీలించి దీనికి పీఠిక వ్రాయుట కనుగ్రహించిన పండితశేఖరులును, ఉదారాశయులు నగు బ్ర॥ శ్రీ త్రిపురారిభట్ల వీరరాఘవస్వామిగారికి నాకృతజ్ఞతాభివందనము లర్పించుచున్నాను.

ఈ గ్రంథముద్రణ విషయములోఁ దగిన ప్రోత్సాహ మును, సహాయమును గావించిన శ్రీ బులుసు సూర్యప్రకాశ శాస్త్రిగారికిని, శ్రీ కారెంపూడి కోటిస్వామిగారికిని నేను కృతజ్ఞతను జూపకుండఁజాలను.

నామప్రయోగ యోజలిపోష్టు } శ్రీరామశరణ్
కుందుర్తి వేంకటనరసయ్య
సంపాదకుఁడు—'మోక్షసాధని'

# కృతజ్ఞత

యుగములు నాల్గు. ఆయా యుగములకు యుగానుసారముగ ధర్మ వ్యవస్థ చేయబడినది. ప్రస్తుత మిది కలియుగము. ఈ యుగమున సుకృతాచరణము కంటె దుష్కృతాచరణము సులభము. అట్టి సుకృతాచరణమును, పాపములకు పలురకముల ప్రాయశ్చిత్తములు శాస్త్రములు నిర్ణయించినవి. కాని యీ కలిలోని పాపములకు పరిహారము కేవల భగవన్నామమె.

భగవంతునికన్న నామమహిమ అనంతము. శ్రవణము చేతనే మానవుడు పాప విముక్తుడగును. అట్టితఱి భక్తితో స్మరణముచేసిన చెప్పనదేమి? భగవన్నామమును సంకీర్తన చేయుటలో విధినియమములు గలవు. అట్టినియమములను పాటించుచు చేసిన భగవన్నామ మహిమ చెప్పనలవికాదు. సంకీర్తనా విధానమును సాకల్యముగ సులభమగు సరళమధుర భాషలో రచించి ఆధ్యాత్మిక లోకమున కందించుచున్న బ్రహ్మశ్రీ, శ్రీ కుందుర్తి వేంకటనరసయ్యగారు, ప్రశంసాపాత్రులు. వారికి కృతజ్ఞతాపూర్వక ధన్యవాదములు. ఈ గ్రంథమును చిరకాలమునుండి ప్రకటింపవలయుననెడి మాకోరిక నేటికి తీరినది. ఈ గ్రంథము ద్వారా సహృదయులు సంకీర్తనా విధానమును తెలిసికొని తత్ఫలమును భగవదనుగ్రహమును పొందుదురుగాక.

తెనాలి
వికృతి వైకుంఠ ఏకాదశి.

సంపాదకుడు,
సాధనగ్రంథమండలి.

# ప్రాక్కథనము

శ్లో॥ వినోదినీ భక్త సుభృంగ మంజరీ
వినాశిని సంసృతి-తాప-భీషికా
స్వరూపిణీ సాధన-సాధ్య, ఇష్టదా
విభాతు చిత్తే హరినామ వల్లరీ॥

సంకీర్తనా ప్రచారమగు కొలంది దానిని నియమితము కావించుటకును, తెలిసికొను నావశ్యకతయుం బెలుగుచుండును. ఇప్పటికి రెండు సంవత్సరములనుండి 'సంకీర్తన' పత్రికకు సంపాదనాకార్యమును నిర్వహించుచుండ నా సముఖమునకు వచ్చిన సమస్యలు దీనికిం బురికొల్పినవి. అందను సంకీర్తనా రహస్యములను, నియమములను తెలిసికొనంగలుగు నంతటి సరళోపాయముండవలె ననుకొంటిని. ఈ యావశ్యకతా స్ఫూర్తి కొలుపు, స్ఫూర్త్యాధారము ప్రకారము సూత్రములు లిఖించుటలోం బ్రవృత్తి కలిగినది. ఎవ్వరికిని కఠినత తోంపకుండుటకుగా సూత్రములను హిందీలో వ్రాసి, అత్యల్పమగు వ్యాఖ్యలో వాటి యుద్దేశ్యమును స్పష్టము చేయుటకు ప్రయత్నము చేయంబడినది. సూత్రములను వ్రాయుట నా విషయములో ధృష్టతయే యైనప్పటికి, నా అశక్తతను బట్టి యుదారులగు సజ్జనులు నన్ను క్షమింతురుగాక! తప్పు లుండవచ్చును; ఉండిన విద్వాంసులు వాటిని సవరింప వచ్చును. పిల్లలు పొరపాట్లు చేయుచుం జేయుచుం గొప్పగ నేర్చుకొందురు.

ప్రకృతిలో సమస్త వస్తువులు త్రిగుణాత్మకముగ నుండును. గావున నీ సంకీర్తనము యొక్క వర్తమాన స్వరూపము కూడ దానినుండి తప్పించుకొనలేదు. దీనిలోఁగూడ మూఁడు రకములున్నవి. వాటిని దెలిసికొని మనము తామసమునుండి తప్పించుకొని, రాజసమును సాత్త్వికము వైపునకుఁ గొని పోవలయును.

౧ - సర్వత్ర అందఱు ప్రేమీ పురుషులే చేయు సంకీర్తనకు సాత్త్విక సంకీర్తన యని పేరు. దీనిలో నందఱు ననురాగముతో భగవన్నామమును జేయుచుందురు. స్వర తాళ మృదంగాదుల చింతయే యుండదు. ఈ సాత్త్విక సంకీర్తనమే గుణాతీతమై. భక్తులు తన్మయులై శరీర మనస్సులను రెంటిని దాఁటి పైకి పోయినప్పుడు భగవంతుని ప్రత్యక్షము కావించును.

౨ - ఇఁక రాజసము—గొప్ప గొప్ప యుపదేశకులు, గాయకులు, యుపన్యాసకులు లేక శోభింపనిదియు, స్వర సంగీతాదులకు కొంచెముగనో గొప్పగనో స్థానమీయఁబడిన సమస్త యుత్సవములును, బాహ్యాడంబరములేక పని జరుగనిదియునై యున్నది. ఇది చెడ్డది కాదు, కాని దీని యుద్దేశ్యము సాత్త్విక కీర్తన వైపునకుఁ బోవలయును. ఇది తామసమునుండి సాత్త్వికము వైపునకుఁ గొనిపోవుట కావశ్యకమై యున్నది.

3 - తామసము—శాస్త్ర. విధి, మర్యాదా ధ్యానము లేనిదియు, ఒకఁడు గోలగ పోట్లాడుటయు, వేఱొకఁడు

తాంబూలము నములుటయు, ఇంకొకరియు మధ్యలోఁ గూర్చుం డుటయు, సిగరెట్లు కాల్చుటయు, కనుచెప్పు లెగురవేయుచు సైగలు చేయుచుండుటయు, కన్నులను, చెవులను తృప్తిపరి వించుటకు మనోరంజకమగు సామాగ్రిని ప్రోత్సహించుటయు, భగవన్నామమందు వాసనారాహిత్యము కావించుకొను సామగ్రిని కలిగియుండుటయు, సంకీర్తన పదములు మాత్రము (భంగము చేయున లగువాటిని) వ్రాసి, తందనాలు వేయుటయు, నాటకీయముగ మూర్ఛాదుల నటించుటయు. భక్తి లభించుకొనుటకు మంచి యవకాశముగ భావించుటయు లోపమగు సంకీర్తనము. దీని కెల్లప్పుడును దూరముగ నుండవలయును. నిజమైన సాధకు డిట్టి కీర్తనములోఁ గూర్చుండుట కిష్టపడఁడు.

పారివారికకీర్తనము:-

అన్నిటికంటె నిదియే సంకీర్తనము యొక్క ముఖ్యరూపము. తన కుటుంబ పరివారమున్న యింటిలో నొక ప్రార్థనా గృహముండవలయును. దానిలో నిత్యానుసారముగ భగవన్మూర్తి యున్నను సరియే లేకపోయినను సరియే, అచ్చట హవన పూజనాదులు జరుగుచుండవలయును. పరివారములోని వారు ఉదయము గాని సాయంత్రము గాని దానిలోఁ జేరి కొంచెము సేపు సంకీర్తనము చేయవలయును. సమ్మిళిత ప్రార్థన చేయవచ్చును; ఎవరికైన వచ్చియుండిన ఒకటి రెండు ధార్మిక గీతములను పాడవచ్చును. అవశ్యకమైన యెడల

స్త్రీలకు పరదా యేర్పాటు చేయవలెను. లేదా పురుషులొక సమయమునను, స్త్రీలొక సమయమునను వంతుల ప్రకారము కీర్తన చేయవచ్చును.

సామాన్యకీర్తనము:-

ప్రతి గ్రామములోను, లేక ప్రతి పేటలోను ప్రతి దినము సంధ్యాకాలమునకుగాని, లేకున్న కనీసము వారమున కొక దినమునఁగాని అందఱు సమావేశమై కీర్తన చేయుటకు వీలుగా నొక స్థానముండవలయును. కీర్తనకు దోడుగా నేదైన కథగాని, పదము గాని యుండవచ్చును. కీర్తన స్థానమున నుచ్చాసనమున భగవన్మూర్తి నుంచవలెను. స్త్రీల కీర్తన స్థానము పురుషులకు వేఱుగనైన నుండవలెను. లేదా నొకే స్థానముననైన నుండవచ్చును.

సంకీర్తనోత్సవము:-

ఇది పెద్ద సమ్మేళనము కానిండు, చిన్న యుత్సవము కానిండు. అన్నిటికి నొకే విధమగు నేర్పాటులుండవలయును. ఉత్సవములోఁ దల్లులు కూర్చుండుటకు స్థలము పురుషులకు వేఱుగ నుండవలయును. వారి రాకపోకల మార్గముకూడ వేఱుగ నుండవలయును. ఏదైన పరదా కట్టు యేర్పాటు కావింపవలయును. లేక పురుషుల దృష్టి పడనట్టి చోట నేర్పాటు చేయవలయును. పురుషులలో నెవఁడును జివర కేర్పాటుల కొఱకైనను స్త్రీలలోనికి వెళ్ళకుండునట్లు చూడవలయును. హారతి మొదలైనవి పిల్లవాండ్రద్వారా పంపవలయును,

సంకీర్తనమునకు వచ్చిన వారికి బసలు, భోజనముల యేర్పాటులను సముచితరీతిని జేయవలయును. ఉత్సవ సమయమున నేర్పాటులను గావించువారు సంకీర్తనలో భాగ్గొనరాదు. ఒక వ్యక్తి వెనుక నిలుచుండి [illegible] కూర్చుండు నేర్పాటులను గావింపవలయును. మహాత్ములకు ముందుగా నాసనము లేర్పాటు కావింపవలయును; కాని భగవంతుని యాసనమునకు సమానముగాఁ గాని, ఎత్తైనఁగాని వేరో యాసనము నుండరాదు. ధనము, విద్య మొదలగు కారణములచే నెవరికైన ముందాసనమిచ్చినచో బీద భక్తుల కవమానముగాని, కష్టముగాని కలుగకుండునట్లు చూడవలయును.

ఎవరైన మాటలాడుకొనుచుండిన వారట్లు చేయకుండ కార్యనిర్వాహకులు వారిని వారింపవలయును. ఎవరైన నియమభంగము కావించెనా వానిని వారింపవలయును. అట్లు వినకున్న వానిని దూరముగ నెట్టివేయవలెను. ఎవరైన మూర్ఖపాషండత్వములను ప్రదర్శించిన నది స్పష్టముగఁ దెలియు నెడల దానిని గూడ వారింపవలయును. లేకపోయిన వెళ్ళిపొమ్మనవలయును. తాంబూలము నములువారిని, బీడీలు త్రాగువారిని వాటి నావలఁ బారవైచి కూర్చుండుమని ప్రార్థింపవలయును. కీర్తనము మధ్య ప్రసాదమును పంచిపెట్టరాదు. దానిని ద్వారము నగ్గఱబెట్టి వెళ్ళువారికి పంచిపెట్టవలయును.

అఖండకీర్తనము:—

కేవల మొకే నామముతో నిశ్చితకాలమువఱకు అఖండకీర్తన ప్రవాహమును ప్రవహింపఁజేయవలయును. నామమును మార్చుచుండుట పనికిరాదు. కీర్తనము జరుగునంత వఱకు అఖండ దీపము వెలుఁగుచునే యుండవలయును. కలశ స్థాపన చేయునెడల చాల మంచిదే. అట్టి యెడ క్రిందటి దినము సంధ్యాకాలమున వచ్చు టచ్చట గౌరాంగ మహాప్రభువు నాహ్వానించు నాచారము కలదు. కాని యిది యావశ్యకము కాదు. భగవంతుని బూజించి కీర్తనను ప్రారంభింపవలయును. నిశ్చితకాలము పూర్తియైన తర్వాత హారతి నిచ్చి సమాప్తి కావింపవలయును. పూర్తియైన తర్వాత వేఱు వేఱు నామములను గీర్తించుట, పదములను, ఉపదేశములను, హరికథలు మొదలైనవి జరిగిన నింకను బాగుండును.

అనుష్ఠానము:—

సంకీర్తనము దీర్ఘకాలానుష్ఠానముగఁ జేయఁదలఁచిన సాధకులకు భోజన వస్త్రాదుల నేర్పాటు చేయవలయును; కాని వేతనము, కూలియిచ్చి అనుష్ఠానమును జరిపించిననే మహత్వముఁ నుండబోదు.

సంకీర్తనకు సామాన్య నియమములు:—

సంకీర్తన స్థానములో నందఱు శాంతితో మొట్ట మొదట హరిః ఓం అని గాని, రామ్ అని మూఁడుసార్లు గాని దీర్ఘధ్వనులు చేయవలెను. తర్వాత నొకఁడు మొదట

చెప్పుటయు, తర్వాత నందఱును బలుకుటయుఁ జేయవల యును. ఒక్కసారియైనను బలుకవచ్చును, అప్పుడు కన్నుల నైన మూసికొనవలయును. లేదా భగవంతుని చిత్రమునైన నఁ జూచుచుండవలయును. అక్కడ కూర్చుండి యుత్తరములు వ్రాసికొనుట, చదువుట, సంభాషించుకొనుట అన్నియు మానవలయును. తాంబూలము, పొగాకు మొదలగునవి లేకుండఁ జాలకున్న యెడల మెల్లగా బయటకు వెళ్ళి వానిని సేవిం చి మరల ప్రవేశించుకొని రావలయును. అచ్చట నే వస్తువును దిననుకూడదు, త్రాగను గూడదు. కాళ్ళుచాచుకొని కూర్చుం డుటయు, నిద్రించుటయు, నవ్వుటయు. సైగలు చేయుటయు, మానవలయును. ఎవరు వచ్చినను, నెవరు పోయినను మీకే మియు జోక్యములేదు. నామము చెప్పువాఁడొప్పునటుల ఆధ్వని తప్ప వేఱొకధ్వని వినికిరాదు. త్వరత్వరగా నామములను మార్చరాదు. నీ కిష్టమైన నామమునే పలుకవలెనను. పట్టు పట్టరాదు. ఎవరైన చెప్పుమని కోరిన చెప్పవలెను కాని లేదు, కాదు అనుట మంచిదికాదు. అచ్చటకు వచ్చిన వారందఱును బలుకవలయును. కాని గొణుక్కొనైనను మెదలకుండ కూర్చుండరాదు. లోలోన నోటిలోనే పలుకరాదు. శక్తి కొలఁది బిగ్గఱగఁ బలుకవలయును. వాద్యములున్న మంచిదే, లేకున్న మఱీ మంచిది. వాద్యస్వరములందు దృష్టినుంచరాదు. ఎవఁడైన ప్రేమతోఁ జెప్పుచుండెనా, వానివెంటఁ బలుక వలయును. ఒకవేళ వాద్యములు లేకున్న నఱచేతులున్నవి కదా!

సంకీర్తనసంఘము:—

సంకీర్తన సంఘము లెన్ని కలవో వాటి నన్నిటిని సంఘటిత మొనర్పవలెను. సదస్యులను, ప్రేక్షకులను వృద్ధి చేయుటకంటె కొద్దిమందైనను శుద్ధ ప్రేమిభక్తుల సంఘ ముండుటమంచిది. నియమ పాలనముచేయనివారిని, శాస్త్రీయ విధులకు విరుద్ధముగ నడచువారల నవశ్యము తీసివేయవలెను. ఒక్క చేప చెఱువునంతను చెఱుపఁగలదు. బాహ్యవేష ములు, ఆడంబరములమీఁద ప్రజల ధనమును వ్యర్థపఱుప నీయరాదు. గొప్ప గొప్ప భవనములు కట్టుట, గొప్ప గొప్ప రుసుములిచ్చి యుపదేశకులను పిలిపించుట అవసరములేదు. పని జరుగకపోయిన నేదైన నొక చిన్న గదిని నిర్మింపవచ్చును. శుద్ధాచారులగువారును, కేవలము భోజనమార్గ వ్యయములను మాత్రమే కైకొనునట్టి ఉపదేశకులను, ప్రచారకులను మాత్రమే పిలువవలెను. చివరకా ప్రయాణపు ఖర్చునైనను తక్కువ తరగతులకే యీయవలయును.

ఎంత చందా ప్రోగైన నంతనఱకే ఖర్చుపెట్టవలెను. పొరపాటుననైన శాశ్వత నిధిని శాశ్వత సంపత్తును ఏర్పరు చుటకుఁ బ్రయత్నింపవలదు. ఒకవేళ నట్టి సమయము సంభ వించినప్పటికి దాని నంగీకరింపరాదు. ధనమున్నచోట దోష మున్న దన్న మాటే.

ఏమతమును గూర్చిగాని, ఏ సంప్రదాయము నెడలఁ గాని ద్వేషమూనరాదు, ఖండింపరాదు. ఇట్టి ప్రచారములకు దూరముగ నుండవలయును. అత్యధికముగ దీనుల సేవ

చేయవలెను. ధార్మిక కార్యములను తోడ్పడవలయును. తాత్కాలిక సేవకై స్వయంసేవక సంఘమును సదా సేవకై సిద్ధముగ నుండునట్లేర్పఱచవలయును.

సంకీర్తన సంఘములు ఉత్సవముల జంజాటములో నెక్కువగ పడకూడదు. ఇవి సాధనములు కాని ప్రచారక సాధనములున్నవి. గట్టిపని, యెంత యధికముగ లభించిన నంత అధిక పరివారముతో పారివారిక సంకీర్తనము నారంభింప వలయును. దగ్గఱ వారందఱు కలసి కనీసము వారమున కొక సారియైన సంకీర్తన చేయు సంఘములను ఎన్నిచోట్లైన అన్ని చోట్ల సంఘముల స్థాపింపవలయును.

ముందు చెప్పబోవు కీర్తన కాలమును ఆయా కాలములో కీర్తన అలవాటును సమాజములో నేర్పఱచవలయును. పైగట్టి ప్రచారములో సహాయత లభించునట్లు ఉత్సవములందును, తిరునాళ్ళయందు సమ్మేళనమునర్పఱ ప్రయత్నింపవలయును. వీలైనంత వఱకు సాత్విక కీర్తన ప్రచారముకొఱకే ఉత్సవాదుల నాశ్రయింపవలయును.

బయటనుండి యెవరైన ప్రచారకులు వచ్చునెడల వారు నివసించుట కేర్పాటులను గావించి, వారిద్వారా యెంత లాభమును బొందవీలగునో అంత పొంద వలయును. యథా శక్తి వారికి సత్కారములు చేయుటయు గర్తవ్యమే యగును. దీనికి తోడుగా జనులు ధర్మ, శాస్త్రీయ మర్యాదలను

పాలించుటకుఁ బ్రవృత్తులను గావించుట కూడ ఒక కార్యమే. ఇట్లుమనము స్వయముగ నా మర్యాదలను బాలించునప్పుడే జరుగఁగలదు.

సంకీర్తన ప్రచారకుఁడు:—

నేఁడు హరికథా వ్యాపారము జరిగినట్లు సంకీర్తన వ్యాపారము జరుగుట అభీష్టముకాదు. భగవన్నామ ప్రచారమందు నిజముగ మనస్సుండిన యెడల వారు త్యాగపూర్వకముగ నీకార్యమును జేయవలయును. వారికి సదాచారము, సరళత పరమావశ్యకము, వారికి నిషాది వస్తువుల దుర్వ్యాసనముండరాదు. ఇది చాలముఖ్యము.

ప్రచారకుఁడు వీలైనంతవరకు మూఁడవ తరగతి పెట్టెలోఁ బ్రయాణము చేయవలయును. మార్గవ్యయము, భోజన వస్త్రాదివ్యయము తప్ప అతఁడు వేతనజీతమును గొనరాదు. వస్త్ర, వేషములు సాదాగాను, సాత్త్వికముగాను నుండవలయును. ప్రజలపైన ఒక్కటైన వ్యర్థముగ ఖర్చు కాకుండ నుండునట్టి కార్యమును చేయవలయును.

వానికి సహనశక్తి ఆవశ్యకము. ప్రయాణ కష్టములే కాక భోజనాది కష్టములు, విరోధులద్వారా అపమానములు కూడ లభించుచుండును. అన్ని సౌకర్యములు మనకు జరుగునని ఆశింపరాదు. అతఁడు ప్రచారము బొత్తిగాలేని ప్రాంతమునకు వెళ్ళవలెను. అతఁడు కేవలము భగవద్విశ్వాసము మీఁదనే పనిచేయవలెను. ఒకవేళజనులు రాగనుకొనుఁడు,

ప్రజలు వాని కీర్తనము నాదరింపరనుకొనుడు అట్టియెడ నిరాశ చెందుటకాని, అప్రసన్నుడగుటగాని పనికిరాదు. ప్రచారకునియందు ధైర్యముండవలయును.

మహాత్ముడు కానిండు, భక్తుడగుగాక, కథావాచకుడగుగాక, కీర్తనకారుడగుగాక, ఎవడైనగానిండు ఆడవాండ్రమధ్యను ప్రచారార్థము వెళ్ళరాదు. స్త్రీపురుషులను బిలువనురాదు. ఒకవేళ స్త్రీలే పిలుచునెడల కూడ వెళ్ళుట మంచిదికాదు

ప్రచారకుడే యాడంబరమును జేయరాదు. మూర్ఛపడిపోయినట్లు నాటకమాడరాదు. కృత్రిమరోదనము, అశ్రువులు రాల్చుట పనికిరాదు. ఏది చేసినను యథార్థమైన హృదయముతో జేయవలయును. గుంపును ప్రోగుచేయుటకును, ప్రజలను ప్రభావితము కావించుటకును కపటనాటకమును బూనరాదు. తాను నంత మహాత్ముడనని ప్రసిద్ధికావించి పూజ చేయించుకొనవలెననుట మిక్కిలి నింద్యము, ఎవరు రానిండు, ఎవరు పోనిండు, నీ ప్రభావము వారిమీదపడనిండు, అది నీ బలముచే గాదు, లోకుల కొఱకు గాదు ప్రభువును సంతోషపెట్టుటకు, ఆతడు యథార్థముచే ప్రసన్నుడగును. ప్రచారమైనను ఆతడు చేసినదే కాని నీ ప్రయోజకత్వము వలనగాదు. కాబట్టి నీవే కపటనాటకమాడరాదు.

సంకీర్తనావసరము:—

సంకీర్తన మెప్పుడు చేసినను చేయనచ్చును. ఎప్పుడు బుద్ధిపుట్టిన నప్పుడే. ఫలానప్పుడు చేయవలెనను బంధనము లేదు. కాని కథా, యజ్ఞ, పూజన, పాఠ, శ్రాద్ధ, విప్రభోజన, వ్రత, జప, అనుష్ఠాన ప్రభృతి సమస్త ధార్మిక కృత్యములను ప్రారంభించినపుడును వాటిని సమాప్తి చేయునపుడును నామకీర్తన పరమావశ్యకము. ఏలననగా మానవుని వలన స్వాభావికముగ దోషము లుండును. ఎంత జాగ్రత్తగా కర్మ చేసినప్పటికి పొరపాట్లు వచ్చితీరును. భగవన్నామ కీర్తనము వలన పొరబాటున చేసిన దోషములు పరిమార్జన మగును. కర్మ పరిపూర్తి యగును. నామసంకీర్తనము లేక ఏ ధర్మ కృత్యము పూర్ణముకాదు.

ఇది కాక ఏకాదశి, ద్వాదశి, ప్రదోషము, అమావాస్య, పూర్ణిమ, మొదలగు పర్వములు, జన్మోత్సవము, వివాహోత్సవములు, మొదలగు నుత్సవములందును, ఏదైన యుత్సవములలో జనసమూహము చేరినపుడును, కొన్ని గంటల కాలము అవశ్యము సంకీర్తనలో వినియోగింపవలయును. శ్రీరామనవమి, కృష్ణాష్టమి, దీపావళి, శివరాత్రి మొదలగు మహాపర్వములందు కీర్తన చేయునెడల విశేష ప్రభావముపడఁగలదు. హోళికోత్సవ మొక్కటియే సంకీర్తన పర్వము, ఆదినమున చెడుపాటలుమాని భక్తిమయములగు కీర్తనలు, నామములు పాడవలయును.

ఇక్కడ చాల స్వల్పవిషయములను సంక్షిప్తముగ నిర్దిష్టము కావించితిమి. 'మీమాంస'ను ధ్యానములో బెట్టు కొని నియమముల నన్నిటిని స్వయముగ దెలిసికొనవచ్చును. అన్నిటికంటె సూటిముక్క యేమనగా మనస్సు సాంసారిక ప్రవృత్తిని జెందక, ప్రభుపాదములందే కొంచెమైన భక్తి యున్నప్పటికి వాని మృత్యుసమయమున 'రామనామసత్య హై' అను రూపమునను, జన్మోత్సవ సమయమున 'జయ కన్హయి యాలాల్ కీ' అను రూపమునను భగవంతుడనుగ్రహించును.

నేను ఈ పుస్తకమును వ్రాయుటలో చాల అనధికార సాహసము కావించితి ననుకొనుచున్నాను; కాని దీని ద్వారా భగవన్నామము మీద ప్రేమ గలవారలకే కొంచెమైన ఆనందము కలిగినచో నాకు ఈ దోషముల విషయములో నేవిధమైన విచారములేదు.

శ్లో॥ యత్కీర్తనం యత్స్మరణం యదర్చనం
యద్వందనం యచ్ఛ్రవణం యదర్చనమ్।
లోకస్య సద్యః విధునోతి కిల్బిషం
తస్మై సుభద్రశ్రవసే నమోనమః ॥ "

భక్తసేవకుడు

'సుదర్శన్'

శ్లో॥ "కలికాలే నామ రూపే కృష్ణ అవతార।
నామహైతే హయ సర్వ జగత నిస్తార॥
నామ బినా కలికాలే నాహిృ ఔర ధర్మ।
సర్వ మంత్ర సార నామ ఏఈ శాస్త్ర మర్మ॥

శ్రీ చైతన్య చరితామృతము.

శ్రీహరిః

# సంకీర్తన మీమాంస

## ప్రథమాధ్యాయము

సర్వయుగములందును సర్వకాలములందును ఆ పరమ ప్రభుని నామము జీవులందఱకు పరమమంగళకారణమైనది. నామముద్వారా దివ్య భౌమ, అంతరిక్షములోని సమస్త ఈప్సిత విభూతులను గోరువారు వాటిని పొందిరి. నామ సాహాయ్యమున ప్రారబ్ధ సంబంధమైన కుటిల కర్మలపై మానవుఁడు విజయము పొందినాఁడు. యముని నెత్తిన కాలుంచి ప్రతిరోధ శక్తులను కాలరాచి అది తన నిత్య ధామమునకుఁ జేర్చును. కలియుగములో నిది యొక్కటియే సాధనము. సౌభాగ్యవశమున నేఁడు పుణ్యభూమి, కర్మభూమి యగు భారతదేశములో ప్రజలీమహాసాధనము నభిమానింపఁ బ్రారంభించిరి. కాని సర్వసాధారణముగా ననభిజ్ఞులగుటచే నీ సాధనమందు కొన్ని పొరపాట్లు చేయుచుందురు. కొందఱు దీని మాహాత్మ్యమును దెలిసికొనఁజాలక పోవుటచే పరిహాసము చేయుచుందురు. అందువలన నామ మాహాత్మ్యము, విధులను గూర్చిన వివేచన మావశ్యకము. 'జానే బిను నహోఇ పరతీతీ' 'తెలిసికొనక విశ్వాసము కలుగదు.' కావున భక్తుల

యందు విశ్వాసము వృద్ధికావలెననియు, వారు దీనిలోని మహా రహస్యము నెఱుఁగవలయు ననియు భావించి యీ 'సంకీర్తన మీమాంస' ఆరంభింపఁబడుచున్నది.

సూ॥ భగవత్సంబంధ సాధన బుద్ధ్యా కృత గానం
సంకీర్తనమ్॥ ౧—౧

తా॥ భగవత్సంబంధమైన సాధన బుద్ధిచేఁ జేయఁబడిన గానమునకు సంకీర్తనమని పేరు.

గానమనేక విధముల ప్రతివ్యక్తి చేయును కాని గాన మాత్రము సంకీర్తనమని పిలువఁబడదు, భక్తిమయములగు కీర్తనలను గూడ గాయక శ్రోతలను నానందింపఁ జేయుటకు పాడుచుందురు. ఇట్టివారు సాధారణముగ స్వాభావిక గానములో భక్తకవుల కీర్తనలనే పాడుచుందురు. ఇట్టి గానమది భక్తివిషయకమైనది కానిండు కాకపోనిండు అది సంకీర్తనమని పిలువఁబడదు. ఆత్మ కల్యాణము నిమిత్తము భగవన్నామ, గుణములను గానము చేసినప్పుడును, దానిద్వారా తన యాత్మోన్నతియొక్క ఆశయున్నను, భగవంతుని వలన నేదైన భౌతికవస్తువును బొందవలెనను విశ్వాసమున్నను, లేక కోరిక ఉన్నను అప్పుడే అది సంకీర్తన అని పిలువఁ బడును, ఇట్టిగానములో సాధన విధి భక్త చరిత్రలు, వైరాగ్య ప్రధానమగు నుపదేశములు మొదలైనవాటిని గూర్చి దాని యొక్క యుద్దేశ్యము భగవంతుఁడు ఆత్మోన్నతి అయినప్పటికిని కీర్తన చేయవచ్చును.

సూ॥ ఏకాంతేన కీర్తనం, సామూహికేన సంకీర్తనమ్. ౧-౩

తా॥ ఒంటరిగాఁజేసినఁ గీర్తనమందురు. సామూహికముగఁ జేయుట వలన సంకీర్తనమందురు.

మహాపురుషులందఱు చెప్పినదేమనఁగా—'మనస్సు చంచలమైనప్పుడును, విపత్సమూహములు క్రమ్మినప్పుడును, ప్రపంచములో నే యాధారము కనఁబడనప్పు డేకాంతము నకుఁ బోవలయును. ప్రాపంచిక నేత్రములను మూయుఁడవై యా పరమ పితను బిలువుము. అప్పుడాతఁడు వినును, తప్పక వినును. అక్కడనుండి నీ కష్టములన్నిటికి ప్రతీకారము కలుగును. ఆర్తుఁడై గద్గదకంఠుఁడై ఏకాంతమున శ్రద్ధావిశ్వాసములతోఁ బ్రేమ పూర్వకముగ నఖిలేశుని బిలుచుటయే నిర్బలునికి బలము. దీనివలన నాంతరిక శాంతియు, ప్రసన్నతయు, ప్రాప్తించును.

అంగములతో (వాద్యప్రభృతులు) బూర్ణముగ నున్నప్పుడే గానములో రసమువచ్చును. గాయకునకు నంత నలుగురు వారు యిద్దరు ముగ్గురుండవలెను. గానాంశమందు సంకీర్తన యీ విధముగ సామూహికమగును. కాని సంకీర్తనా సమూహములో సంగీత దృష్టియుండదు. అది సామూహికోపాసన దృష్టిలోనుండును. సామూహికోపాసన సాధారణముగా లోకములోని సమస్త ధర్మ సంప్రదాయములలోను బ్రచలితమైనది. వాటిలోఁ గల ప్రయోజనము ఈ సంకీర్తనములోఁ గూడ కలదు. దీనిలో ప్రతివ్యక్తి తనశక్తిని యితరులకిచ్చును.

ఇతరులశక్తిని తాను గ్రహించును. ఒకే విధమగు విచారము, సాధన అగుటచే సాధకులకు శీఘ్రముగ మానసికోన్నతికలుగును, మానసిక దుర్బలతలు, వ్యక్తిగతదోషములు, అజ్ఞానమునఁజేసిన పొరపాటులు సమాజములో సంశోధింపఁబడును. అక్కడ వాసనల ఉత్థానము స్వతః కలుగదు. సమూహములో స్వతః శ్రద్ధోద్రేకముండును. కలియుగములో విశేషతః సమూహములోనే శక్తి కలదని యొప్పుకొనఁబడినది. (సంఘే శక్తిః కలౌ యుగే) కావున నేఁటిరోజులలో సామూహిక సంకీర్తనము అధికముగ నవలంబింపఁదగినది

సూ॥ సంకీర్తనం ద్వివిధం, గుణసంకీర్తనం నామసంకీర్తనమితి॥ ౧—3

తా॥ సంకీర్తనము రెండువిధములు. గుణసంకీర్తనము, నామసంకీర్తనము.

వ్యక్తిగత, సామూహికములను రెండువిధములగు కీర్తనలను రెండుభాగములుగ భాగింపవచ్చును. ఒకరకపు కీర్తనములో భగవంతుని గుణమో, లీలయో, వైరాగ్యమో, భక్తిపదకమగు నేదైన నుపదేశమో ఏదైన నొకభక్తుని చరిత్రమో మొదలగునవి యుండును. ఇఁక రెండవదానిలో కేవలము భగవన్నామమే యుండును. ఏ నామములలో గుణములుగాని లీలలుగాని ప్రధానముగ నున్నవో (ఎట్లనఁగా:- 'పతితోద్ధారక రామ భజో', ప్రేమ ధామ ఘనశ్యామ భజో") ఇట్టివాటిని గుణ కీర్తనములోనే

చేర్చవలయును. కాని యే నామములలో నామమే ప్రధానమై పద, రాగ పూర్తికొఱకు "జయ" "భజ" ఇత్యాదులను జేర్చబడునో అది నామకీర్తనమని పిలువఁబడును.

సూ॥ ప్రథమం భావోద్దీపకత్వాత్ భక్తేరంగమ్॥ ౧—౪

తా॥ మొదటిది భావోద్దీపిక యగుటవలన భక్తికంగము.

గుణకీర్తనము కాని లీలాకీర్తనముకాని భక్తినుద్దీపింఁజేయును. దీనివలన హృదయములో శ్రద్ధ యేర్పడును. భగవంతుని మీఁద విశ్వాసము కలుగును. ప్రేమప్రాప్తించును. "శ్రవణం కీర్తనం" అనుదానిలో నీ గుణకీర్తనమును గూర్చియే సంకేతింపఁబడినది.

ఈ గుణ కీర్తనముద్వారా యెట్టి క్రమిక భక్తి భూమికను ప్రాప్తించునో భాగవతములోనే కలదు:—

శ్లో॥ శృణ్వన్ సుభద్రాణి రథాంగపాణే
ర్జన్మాని కర్మాణిచ యాని లోకే।
గీతాని నామాని తదర్థకాని
గాయన్ విలజ్జో విచరే దసంగః॥

శ్లో॥ ఏవం వ్రతః స్వప్రియ నామ కీర్త్యా
జాతానురాగో............

గుణకీర్తనముద్వారా పాపనాశనమై హృదయము శుద్ధమైనప్పుడు ప్రేమతో నాతఁడు నామకీర్తనము చేయును,

ఏలననఁగా ప్రేమయొక్క యుచ్చస్థితిలో ఏకాంకాగహృదయమందు కేవలమభిన్నరూపమున నామము, నామియు మాత్రమే యుందురు.

**సూ॥** ద్వితీయం స్వసాధన సాధ్యరూపమ్॥ ౧—౫

తా॥ రెండవది స్వయం సాధన సాధ్యరూపమైనది.

సాధన చేయునది హృదయమలమును శుద్ధముచేయుటకు ఇంత వఱకు సాధనీయత కలదు. పరమతత్వము సాధన సాధ్యమైనది కాదు. అది నిత్య ప్రాప్తము. హృదయము శుద్ధముకాఁగానే అది దానిలో స్వతః లభించును. నామము స్వతఃహృదయశుద్ధి కావింపఁగలిగినది. దీనినిగూర్చి యుదాహరణములు శాస్త్రములలో నిండియున్నవి. ఎట్లనఁగా :—

శ్లో॥ "నామ్నోఽస్తి యావతీ శక్తిః పాపనిర్హరణం హరేః।
తావత్కర్తుం న శక్నోతి పాతకం పాతకీ జనః॥

శ్లో॥ "అజ్ఞాన దథవా జ్ఞానా దుత్తమ శ్లోకనామ యత్॥"

విష్ణుమూర్తి నామమెంతటి పాపమును హరింపశక్తి గలిగియున్నదో ఎంత పాతకియైనను అంతటి పాపమును చేయఁజాలఁడు. ఉత్తమశ్లోకుని నామమును అజ్ఞానముచేఁగాని జ్ఞానముచేఁగాని పలికిన పాపములు పోవును.

గోస్వామి తులసీదాసుగారు "నామనిరూపన నామ జతనతే" అనిచెప్పి నామముయొక్క పరమసాధనరూపత్వమును స్పష్టముకావించెను. కాని నామము సాధనమేకాదు,

సాధ్యముకూడా, ఏపరమతత్త్వమును బొందుటకు సాధన చేయఁబడుచున్నదో ఆ పరమతత్త్వము నామమే. నామమునకు భిన్నమైన వేఱైన ప్రాప్యవస్తువు లేదు.

**సూ॥ నామ నామినో రభేదత్వాత్॥** ౧-౬

**తా॥** నామమునకు నామికి అభేద మగుట వలన.

నామ మెవరికిని సాధ్యముకాదు, మానవునకు సాధ్యవస్తువు ఆనందమను శంక కలుగవచ్చును. అందఱును సుఖమును బొందవలెననియు, దుఃఖనివృత్తి కావలెననియుఁ గోరుదురు. సాధనమునకు లక్ష్యమిదియే. నిత్యసుఖప్రాప్తి ఆనందస్వరూపమగు పరమాత్మనుగాని లేక ఆత్మతత్త్వమును బ్రాప్తించనది కేవలము భౌతిక భోగములచే కలుగదు. కావున నా పరమాత్మ ప్రాప్తియే జీవమాత్రునకు లక్ష్యము. నామము పరమాత్మ ప్రాప్తికి కారణమగుటచే సాధనము కాఁగలదు. కాని అదే సాధ్యము కాఁజాలదు. అను శంకకు ప్రత్యుత్తరమే మనఁగా నామియగు పరమాత్మ తన నామమునకు భిన్నుఁడుకాఁడు. నామము నామియొక్క స్వరూపము. దానిలో నింకేమియు నవసరములేకయే నామి ప్రకటము చేయుశక్తి లేదు "సంకీర్త్యమానః శీఘ్రమేవావిర్భవతి" (నారదభక్తిసూత్రము) కావున నామము సాధ్యముకూడాను ఇట్లే కాకున్న యెడల "నారాయణా" యని పుత్రుని బిలువఁగా నజామిళుని గొనిపోవుటకు విష్ణుదూతలు రాఁగూడదు. నామములో నామిని బ్రకటింపఁ జేయఁగల నిరపేక్షశక్తి

కలదని యీయుపాఖ్యానము వలన సిద్ధాంతమగుచున్నది. ప్రభావము లేకయే కేవలము ఉచ్చారణ మాత్రముచేతనే అది తన ప్రభావమును బ్రకటింపఁగలదు; ఏలననఁగా అది స్వాయముగ నామియగు పరమేశ్వరుని స్వరూపము.

శ్లో॥ సకృదపి పరిగీతం శ్రద్ధయా హేలయా వా,
భృగువర! నరమాత్రం తారయేత్ కృష్ణ నామ'॥

ఒక్కసారి శ్రద్ధతోఁగాని, హేళనగాఁగాని పలుకఁగా కృష్ణనామము మానవుని దరింపఁజేయఁగలదు.

సూ॥ అప్రాకృతత్వాత్ నప్రాకృతనామసామ్యమ్॥ ౧-౭

తా॥ అప్రాకృతమగుటవలనఁ బ్రాకృత నామములతో దానికిఁ బోలికలేదు.

పోనిండు, నామమునకును, నామికి భేదములేదని యొప్పుకొనునెడల అగ్ని అనఁగానే నోరుకాలవలెను, కలకండ అనఁగానే నోరుతీపికావలయును అను శంకరావచ్చును. దీనికి సమాధాన మేమనఁగా అగ్ని, కలకండ మొదలగునవి ప్రాకృతిక నామములో భగవన్నామ మప్రాకృతికము. కావున ప్రాకృతిక అప్రాకృతిక నామములకు పోలిక యుండనే యుండదు. ప్రాకృతిక నామము లేవియు నిత్యవస్తువును లక్షింపవు. అగ్నిని లక్షించు అగ్నిశబ్దము అనిత్యము. ప్రలయములో నది వాయువులో లీనమగును. కావున అగ్ని శబ్దమాపదార్థముతో నిత్యసంబంధముఁ కలిగి యుండదు. ఇంక

రెండవ విషయము అగ్ని స్థూల పరిచ్ఛిన్న పదార్థము. ఇంక దాని నామమో ఆకాశమునకు గుణమగు శబ్దము కావున రెంటికిని అభేదసంబంధములేదు. సమస్త ప్రకృతియు, ప్రాకృత ప్రపంచము కల్పితమగుటచే 'అగ్ని' శబ్దము, అగ్నితత్త్వము, వాని సంబంధము కూడ కల్పితమే. కావున వానిలో నభిన్నత యుండఁజాలదు. కాని భగవంతుఁడో నిత్యుఁడు, వ్యాపకుఁడు, సత్ స్వరూపము. కావున నాతని నామముకూడ నిత్యము వ్యాపకము, సత్ గానుండవలెను. అది తన వాచ్యమున కభిన్నమైనది.

సూ॥ నామాపరాధాత్ న ఫలదాయీ॥ ౧—౮

తా॥ నామాపరాధము వలన నది ఫలదాయి కాదు.

నామమువలన కింతటి మహిమము, సాక్షాద్భగవద్రూపత యున్నప్పుడు దాని నుచ్చరించు మాత్రముచేతనే ప్రాణులను తరణతారణములు కావింపవలెను గదా! కాని చూడఁగాఁజూడఁగా మానవులు నామమును ఆజీవనము జపించినప్పటికిని అంతఃకరణ వికారములు పూర్ణముగ నిండియే యున్నవే. వారి హృదయములో నామప్రభావ మేమియుఁ గనఁబడుటలేదే, దీనికి కారణము వారు. నామాపరాధములను గావించుటే. నామాపరాధములు లేక చేసిన నాఁడే నామఫలము కనఁబడును. కాని సర్వదా నామాపరాధములలో లిప్తులై యుండువారికి నామఫలము దృష్టిగోచరము కాకుండుట స్వాభావికమే నామాపరాధములివి:—

౧ సజ్జన (సంతసాధుపురుషులు, భక్తులు) నింద. ౨. దుష్టులకు నామప్రభావమును వర్ణించుట (ఏలనసఁగా నిట్లుచేయుటచే వారుదాని ననర్థము కావించి దురుపయోగము కావింతురు.) ౩. శివకేశవులకు (ఒకరి ఆరాధ్యదేవునకు, ఇంకొకరి ఆరాధ్యదేవునకు) భేదమెన్నుట, ౪. వేదశాస్త్రములందు, మహాత్ముల వాక్యములందు అశ్రద్ధ. ౫. నామమహాత్మ్యమును అర్థవాదముగ నెన్నుట. ౬. నామము నడ్డుగాఁ బెట్టుకొని పాప మొనర్చుట (నామసంకీర్తన పాపములను బోఁగొట్టునని నామ నిష్ఠను బ్రకటించుచు మోసమునఁ బాపములొనర్చుట) ౭. తన వర్ణాశ్రమాచారములను విడచుట; (నామసంకీర్తన చేసిన నింక సంధ్యావందనాదులేల యనుకొనుట) ౮. ఇతర సాధనలు (యజ్ఞాదులు) వంటిదే నామసాధన యనుకొనుట. ౯, నామమహాత్మ్యమును వినియు దానియందు మనస్సు లగ్నము కాకపోవుట. ౧౦. మమతాహంకారములను వృద్ధి చేసికొనుట. ఈ పది యపరాధములనుండి బయటపడి కీర్తించిన నవశ్యము ఫలము కలుగును.

సూ॥ అపరాధ మార్జనమపి తేనైవ స్యాత్॥ ౧—౯
అపరాధమార్జనము కూడ దానివలననే అగును.

నామాపరాధములపై గంభీరముగ విచారము చేయునెడల నామాపరాధము కొంచెమైన చేయని సాధకుఁడుండనే యుండఁడు. అట్లేమియు నామాపరాధము చేయకుండునెడల నామోచ్చారణము తోడనే వానికి భగవత్సాక్షాత్కార

మగును. కాని అట్లగుటలేదు. ఏలననఁగా నేదియో ఒక నామాపరాధము మానవుఁడు చేయుచునే యున్నాఁడు. అపరాధమున్నపుడు దాని పరిమార్జనోపాయముకూడ నుండవ లయును. అపరాధమెంత ప్రబలముగనుండునో దాని ప్రతీకార సాధనము కూడ అంత ప్రధానముగ నుండవలయును. నామము సర్వసాధనములలో శ్రేష్ఠమైనది. నామముతో సమానమగు సాధనమింకొకటి లేదు. నామము స్వయముగ భగవద్రూపము, కావున నామాపరాధము భగవదపరాధమే. దానిని క్షమించుశక్తి భగవంతునకు తప్ప నితరులెవ్వరికి లేదు. భగవంతునికి తప్పితే భగవదపరాధమును పరిమార్జనము చేయఁదగిన సాధన యింకొకటి లేదు. ఈవిధముగానే నామాపరాధము నామము ద్వారానే నశింపవలయును. నామాపరాధము జరిగి నప్పుడు కూడ నామమునే ఆశ్రయిం చవలయును. మాటిమాటికి నామము నభ్యసించు నెడల మెల్లమెల్లగా అపరాధ పరిమార్జనమగును. హృదయము పూర్ణముగ శుద్ధమైనప్పుడు నామాపరాధముండనే యుండదు. అప్పుడు భగవత్సాక్షాత్కారము కలుగును,

సూ॥ భక్తాపరాధాదపి రక్షణీయమ్॥ ౧-౧౦

తా॥ భక్తాపరాధము నుండికూడ తప్పించుకొన వలయును.

భగవంతుఁడు తనకపరాధము చేసినను నను క్షమించును గాని భక్తాపరాధము నెన్నటికిని క్షమింపఁడు. భక్తులకు కష్టము కలిగించు పనులకు దూరముగ నుండవలయును. వైష్ణవ గ్రంథములలో నీ క్రింద నుదహరింపఁబడిన అటువది

నాల్గింటిని అపరాధములుగఁ జెప్పఁబడినవి. కావున వీటి మీఁద దృష్టినుంచి వెళ్లుటచే చాలమేలు కలదు. ౧. భగవానుని ఏదో దేవతగానో, తత్త్వవిశేషముగానో భావించుట. ౨. వేదములు పౌరషేయములనుట, ౩. భక్తులలో జాతి భేద బుద్ధి. ౪. గురువును సామాన్య మానవుఁడనుకొనుట. ౫. భగవత్ప్రతిమను కొయ్య, రాయి, ధాతువు, కాగితము, మట్టి యని యనుకొనుట, ౬. భగవత్ప్రసాదమును సాధారణ తినుబండార మనుకొనుట. ౭. భగవచ్చరణోదకమును సాధారణ జలముగ భావించుట. ౮. తులసిని సాధారణ వృక్షమనుకొనుట. ౯. గోవును సాధారణ పశువను కొనుట ౧౦. శ్రీమత్ భాగవతమును శ్రీమద్భగవద్గీతను సాధారణ పుస్తకమనుకొనుట. ౧౧. భగవల్లీలలను మానవునివి వంటివే అనుకొనుట. ౧౨. సాంసారిక ప్రేమతోడను, స్త్రీసుఖము తోడను భగవల్లీలను బోల్చుట. ౧౩. గోపికలను (భగవంతునకు) పరస్త్రీలనుకొనుట. ౧౪. రాసలీలను గామచేష్ట యనుకొనుట. ౧౫. భగవన్మహోత్సవ సమయములలో స్పర్శాస్పర్శ బుద్ధియుంచుట. ౧౬. ఈశ్వరుని, శాస్త్రములను లేవనుచు నాస్తికులగుట. ౧౭, సందేహాపూర్వకముగ ధర్మాచరణము చేయుట. ౧౮. ధర్మపాలనములో నాలస్యము చేయుట. ౧౯. భక్తులను బాహ్య విషయములందు బిగించుట, ౨౦. సాధు మహాత్ముల గుణదోషములను విచారించుట. ౨౧. తాను ఉత్తముఁ డనుకొనుట. ౨౨. ఏ దేవతనైనను, ఏ శాస్త్రమునైనను నిందించుట.

౨౩. భగవన్మూర్తి దగ్గఱ పీఠముల మీఁదఁ గూర్చుండుట.
౨౪. భగవత్సన్నిధానమునకు పాదరక్షలతోఁ బోవుట.
౨౫. భగవన్మూర్తి సమక్షమున మాలను ధరించుట.
౨౬. భగవంతుని యెదుటకు బెత్తము పట్టుకొనిపోవుట.
౨౭. భగవన్మూర్తి యెదుటకు నీలవస్త్రము ధరించిపోవుట.
౨౮. పలుదోముకొనకయే వెళ్లుట. ౨౯. మలత్యాగము, మైథునాదులొనర్చి వస్త్రము మార్చి శుద్ధిచేసుకొనకయే వెళ్లుట. ౩౦. భగవన్మూర్తి యెదుట చేతులు కాళ్లు బాఱ జాపుట. ౩౧. భగవన్మూర్తి యెదుట తాంబూలమును సేవించుట. ౩౨. భగవన్మూర్తి యెదుట బిగ్గఱగ నవ్వుట. ౩౩. కుచేష్టలు కావించుట. ౩౪. ఆడువాండ్ర చుట్టు తిరుగుట. ౩౫. క్రోధము చెందుట. ౩౬. భగవన్మూర్తి యెదుట నింకొకరికి అభివాదనము కావించుట. ౩౭. దుర్గంధయుక్తమగు వస్తువును తిని ఆదుర్గంధము పోకమునుపే మందిరమునకుఁ బోవుట. ౩౮. మాదకద్రవ్యమును సేవించుట. ౩౯. ఎవరినైన నవమానించుటయుఁ, గొట్టుటయు. ౪౦. కామక్రోధాది కార్యములొనర్చుట. ౪౧. అతిథికి, సాధువునకు ఆదర సత్కారములు చేయకుండుట. ౪౨. తానుభక్తుఁడు, ధర్మాత్ముఁడు, పండితుఁడు పుణ్యవంతుఁడనుకొనుట. ౪౩. నాస్తికులు, వ్యభిచారులు, హింసకులు, లోభులు, అసత్యవాదులతో సాంగత్యము చేయుట. ౪౪. విపత్తిలో నీశ్వరుని యందు దోషమారోపించుట. ౪౫. పాపము కొఱకు ధర్మము చేయుట. ౪౬. ఎవరినైనఁ గొంచెముగనైన బాధించి తాను

ధార్మికుండననుకొనుట. ౪౭. దారా, పుత్ర, పరివార, ఆశ్రిత, దీన సాధువులను బోషింపక పోవుట. ౪౮ ఏదైన వస్తువును తనకు భోగ్యవస్తువుగ నెన్ని భగవంతునకు నివేదించుటయు, ఏవస్తువును నివేదింపక పోవుటయును, ౪౯. తన యిష్టదేవుని పేర నొట్టు పెట్టుకొనుట. ౫౦; ధర్మమును, భగన్నామమును అమ్మి ధనము సంపాదించుట. ౫౧. తన యిష్ట దేవుని విడిచి యింకొకని ఆశ్రయించుట. ౫౨. శాస్త్రమర్యాదోల్లంఘనము చేయుట. ౫౩. బ్రహ్మజ్ఞాని కాకున్నను బ్రహ్మజ్ఞాని వలె నాచరించుట. ౫౪. సంప్రదాయ భేదముచే వైష్ణవులలో ఉచ్చ నీచ నెన్నుట. ౫౫. దేవతలవలె నాచరించుట. ౫౬. అవతార లీలలో తారతమ్యము నెన్ని వారిని నిందించుట. ౫౭. ఎగతాళికైనను ఒకానొకని 'నీవే సాక్షాద్భగవంతుండవు' అనుట. ౫౮. భగవంతుండు ఇతరుల దయంగోరువాండని పొరపాటుననైన అనకొనుట. ౫౯. లోభవశమున నెవరికైన భగవత్ప్రసాదమునుగాని, చరణతీర్థమును గాని యిచ్చుట. ౬౦. భగవచ్చిత్రమునుగాని, ప్రతిమనుగాని, నామమునుగాని అవమానించుట. ౬౧. ఏ జీవికైన ఏవిధమగు కష్టమునైనంగలిగించుట. ౬౨. తర్క వితర్కములలో నోడి పోయినప్పుడు గాని, సిద్ధాంతము చేయంజాలనప్పుడు గాని ఆస్తికత్వమును త్యాగము కావించుట. ౬౩. భగవంతుని అవతారములలోని జన్మ కర్మలు సాధారణములనుకొనుట. ౬౪. భగవంతుని యుగళరూపమందు ద్వైత బుద్ధి కలుగుట.

క్లుప్తముగఁ జెప్పవలసివచ్చిన, శ్రద్ధాళువగు ధార్మికున కేవిధమగు కష్టము కలుగునటువంటి కార్యమునైనను జేయరాదు.

ప్రథమాధ్యాయము సమాప్తము

—:o:—

# సంకీర్తన మీమాంస

## ద్వితీయాధ్యాయము

**సూ॥ ప్రవృత్తి రేవాధికారః॥** ౨—౧

తా॥ ప్రవృత్తియే అధికారము.

ఏ సాధనమైనను, కార్యమైనను చేయుట కధికార ముండవలయును. అనధికార సాధనను సరియైన పద్ధతిని గ్రహింపలేఁడు. పైగా దురుపయోగము కావించి హానిఁ బొందును. లేదా దానినుపేక్షించును. సంకీర్తన సాధనమున కధికారప్రాప్తికి విశేషయోగ్యత అక్కఱలేదు. శక్తిగల శరీరముగాని, తితిక్షు జీవనము, బుద్ధితీక్ష్ణత మొదలగునవి అవసరము లేదు. నామముమీఁద విశ్వాసము కలవాఁడు, నామముమీఁద రుచి కలవాఁడు, నామకీర్తనముమీఁద యిచ్ఛకలవాఁ డధికారియే, వాఁడేవయస్సులోనైన నుండ నిండు, ఏజాతి, ఏ సంప్రదాయము వాఁడైనఁగానిండు, వాని వెనుకటి జీవితమెట్లైన గడుపనిండు, వాని శరీరబుద్ధి లెట్టిస్థితిలోనైన నుండనిండు, శాస్త్రములమీఁద శ్రద్ధలేనివానికి, నామముమీఁద విశ్వాసము లేనివానికి సంకీర్తనమందు ప్రవృత్తి కలుగదు. ఇట్టివాఁ డధికారి కాఁజాలఁడు. వానిని

సంకీర్తనములోనికి బట్టుకొని వచ్చుటయు, వానికి సంకీర్తన
మాహాత్మ్యమును వినిపించుటయు నామాపరాధమే యగును.

సూ॥ న దేశకాలాది నియమః॥ ౨—౨

తా॥ దేశకాలాది నియమములేదు.

ఏదైన నొక కార్యమును జేయవలసియుండిన దీని నే సమయమున, నే స్థానమున జేయవలయునని విచారింపవలయును. అది యే స్థితిలో నున్నదియుం గార్యకర్త చూడవలసియుండును. అది పవిత్రమా? అపవిత్రమా? సంధ్యా, ప్రాణాయామ, యోగ, ధ్యాన, శ్రవణ, చింతన ప్రభృతి సమస్త సాధనముల విషయములోఁగాని, యితర సాంసారిక కార్యముల విషయములలోఁ గూడ యీ విషయములను జూడవలయును. కాని నామవిషయములో శాస్త్రము 'సర్వావస్థాసు సర్వదా' అని ఆజ్ఞాపించియున్నది. ఏ యవస్థలోనైన నుండుఁగాక, పవిత్రుఁడగుఁగాక, అపవిత్రుఁడగుగాక, దేవాలయమున నుండనిండు, శ్మశానమున నుండనిండు, ఏ మురికి స్థలముననైన నుండనిండు, ఏ సమయమైనఁగానిండు, పగలు, రాత్రి, ఉదయము, సాయంత్రము, మధ్యాహ్నము, ఏ ఘడియ యండైనఁగానిండు, ఏ లగ్నముండైనను, ఏ నక్షత్ర యోగాదులండైనను ఏ బంధనమును లేదు. నామకీర్తనము సదా అందఱు నెక్కడైనఁ జేయవచ్చును. అఖండనామజపము చేయువారు మలమూత్రాది విసర్జన కాలమందైనను వారు దానిని విడువరు. అట్లు విడువవలసిన పనియు లేదు.

సూ॥ అవశ్యకీ నిష్ఠా॥ ౨—3

తా॥ నిష్ఠ అవసరమైనది.

సాధనకై గురువు కావలెను. అతఁడు యోగ్యగురువుగ నుండవలెను. దీక్షను గ్రహించి దానిని గురూపదిష్ట ప్రణాళికరీత్యా అభ్యాసము కావించిన నది సమయమునకు ఫలదాయియగును. మంత్రము దీక్షలేక ఫలింపదు. సాధనలో క్రియ సరిగానుండవలెను. కార్యప్రణాళికలో నేదైన కొద్ది పొరపాటు జరిగినప్పటికిని లౌకిక కార్యముకూడ సఫలము కాదు. విరుద్ధ పరిణామములుకూడ కలుగుట కనఁబడుచున్నది. లౌకికకార్యముల స్థితియే యిట్లుండగాఁ నిఁకఁ బారలౌకికమునుగూర్చి చెప్పవలసినదేమున్నది! నామకీర్తన యెటువంటి దనఁగా దీనికి గురువు అవసరములేదు. దీక్షయుఁబనిలేదు. ఒకవేళ యుండెనా బంగారునకుఁ దావి యబ్బినట్లే. ఒకవేళ లేక పోయినప్పటికి యిబ్బందిలేదు. భగవంతుని యే నామమునైన సరియే మీకు దేనిమీఁద విశ్వాసముండిన దానిని గ్రహింపవచ్చును. ఉచ్చారణ శుద్ధముగనుండనిండు, అశుద్ధముగనుండనిండు, స్వరయుక్తమగు కీర్తనకానిండు, స్వరరహితము కానిండు, ఏమియుఁ జింతింపవలసినపనిలేదు. సరిగా పాడనిండు, వంకరటింకరగఁ బాడనిండు నామకీర్తనచేసిన బాధలేదు. అయితే ఒక్క విషయము జ్ఞాపకముంచుకొనవలెను. ఆ నామముమీఁద నీకు నిష్ఠయుండవలయును; విశ్వాసముండవలయును. ప్రతిసంకీర్తన సాధకునకు తన విశ్వాసానుసారముగ

ఒక్క నామమునందు నిష్ఠ కుదరవలయును. రెండు రెండు నిమిషములకొక నామమును మార్చుచుండిన నేమియు లాభము లేదు. ఉత్సవ ములలో సమాజదృష్టినిబట్టి నామమును మార్చుటయనునది వేఱువిషయము. నిష్ఠావిహీనసాధన మేవిధమగు ఫలమును బ్రకటింపదు. ఇష్టమున కెట్లు నిష్ఠయుండవలయునో ఇవ్వేళ రాముని, రేపు కృష్ణుని, ఎల్లుండి శివుని ఆరాధించిన లాభ మెట్లుండదో అట్లె నామమునకుఁగూడ నిష్ఠయుండవలయును. ఆ నామ మొక్కటే తనకు సాధనయనుకొని దానిని జపించి, కీర్తింపవలయును. దానిద్వారా ఆత్మోద్ధారము కాఁగలదు. దీనిమీఁద విశ్వాసముంచవలయును. ఏనామము మీఁదనైన నిష్ఠగాని, స్థిరతగాని, లేనంతవఱకు మనస్సు అంతర్ముఖము కావలసిన అవసరము పట్టదు. అది చంచలతను వదలదు.

సూ॥ ప్రేమ ఏవ నియమః॥ ౨—౪

తా॥ ప్రేమయే నియమము.

సంకీర్తనలో నింత జపము, ఇంతకీర్తన చేయవలెనను నియమము లేదు. ఇతర సాధనములలో 'ఇంతపని చేసినఁగాని యీఫలము లభింప' దనునట్లును, 'ఇంతజపము పురశ్చరణ చేసినఁగాని యిది సిద్ధింప' దని మంత్ర జప విధిలో నున్నట్లును సంకీర్తనలో నియమములేదు. ప్రేమ పరిపూర్ణ హృదయముతో నొక్కసారి కీర్తనచేసి పిలిచినను ప్రేమఘనుఁడగు ప్రభువు రావచ్చును. ప్రేమహీనుఁడగు వాఁడు సంవత్సర



ముల కొలఁది, వేయేల ననేక జీవితములకైన ఆ ప్రభువును బిలువలేకపోవచ్చును, ఏ క్షణమున నీవు ప్రేమములో మునిఁగి కీర్తన చేయఁగలుగుదువో, ఆతనిని బిలువఁగలుగుదువో, ఆక్షణముననే రాఁగలఁడు. ఒక్క క్షణమైన నాలస్య ముండదు. సంఖ్యాకాలములుకాదు ప్రేమయే సమస్తమును.

సూ॥ తత్కృపా సాధ్యా॥ ౨—౪

తా॥ అది కృపాసాధ్యము.

ప్రేమ సాధనము వలన లభించునది కాదు. మనము కోటిసాధనలు చేసినప్పటికిని ప్రేమ లభింపదు. గోస్వామి తులసీదాసుని మాటలివి:—

"యహ గున సాధన తే. నహిఁ హోఈ।
తుమ్హారీ కృపా పావ కోఇ కోఇ॥"

ఈ ప్రేమ గుణము సాధనమువలన లభించునది కాదు. ఒకొక్కఁడు నీకృపవలనఁ బొందును.

యుగముల పర్యంతము తపస్సు చేసియు ఋషులు మునులు ఈ ప్రేమకొఱకు తహతహలాడెడువారు. ముక్తి, జ్ఞానము చాల సరళము కాని ప్రేమ సరళముకాదు. ఆ ప్రేమ సముద్రుఁడు స్వయముగ నెవరిని గృపఁజూచునో వాఁడు ప్రేమియగును. ఆయన కృపలేక దీనిని బొందుటకు వేఱు సాధనము లేదు. ఆయన కృపకొఱకు మనముత్కట ప్రతీక్ష

చేయవలెను. ఆయన దయామయుఁడు కావున మనము నిజముగఁ గోరునెడల నాతఁడవశ్యము మనకుఁ బ్రేమ ప్రదానము కావించును. ఈప్రతీక్ష యెట్టిదిగా నుండవలెను? భాగవత కారుఁడిట్లు చెప్పినాఁడు.

శ్లో॥ తత్తేఽనుకంపాం సుసమీక్షమాణః
భుంజాన ఏవాత్మకృతం విపాకం ।
హృద్వాగ్వపుర్భిర్విదధన్నమస్తే
జీవేత యో ముక్తిపదే స దాయభాక్ ॥

'ఉత్కటాభిలాషతో నీ కృపకై ప్రతీక్షించుచుఁ దన ప్రారబ్ధజన్య సుఖదుఃఖములను ధైర్యపూర్వకముగ భోగించుచు మనోవాక్కర్మలచే నీకే ప్రణామము చేయుచు జీవించువాఁడు ముక్తిపదమునకు భాగస్థుఁడగును. అవశ్యము ఆతఁడు ముక్తుఁడగును.'

నిరంతరము మనోవాక్కర్మలతో నాతని నామకీర్తనము చేయుచు నాతని కృపకొఱకు ఉత్కట ప్రతీక్ష చేయుటయే ప్రేమను బొందుటకు మార్గము. ఆ దయామయుఁడే దయతోఁ బ్రేమను బ్రసాదింపఁగలఁడు.

సూ॥ నాస్త్యి సాధనా పేక్షా॥ —౭౬—
తా॥ ఇంకొక సాధనాపేక్ష లేదు.

జ్ఞానప్రాప్తికి షట్సాధన సంపత్తియు, ప్రాణాయామమునకు నాడీశోధనమును, హవనమునకు దానికి సంబంధించిన సామగ్రిని ప్రోవు చేయుట ఆవశ్యకమైనట్లు సంకీర్తనకే సాధనమును బనిలేదు. కలిసి సంకీర్తన చేయువారు లేకున్న యెడల నేకాకియై చేయవచ్చును. మృదంగ తాళాది వాద్యములున్న మంచిదే, లేకపోయిన అంతకంటె మంచిది. గొంతు సుస్వరముగను, స్వరతాళలయాది జ్ఞానము కలిగియుండ వలసినపనియు లేదు. ఒక వేళ నుచ్చైస్స్వరమున నుచ్చారణ చేయుటకు శరీరములో శక్తి లేకపోయిన నెంతవరకు పలుకఁ గలమో అంతవఱకే పలుక వచ్చును. నిలుచుండియుఁ, గూర్చుండియు, పరుండియుఁగూడ చేయవచ్చును. కీర్తన కనివార్యమగు వస్తువింకొకటి యేదియు లేదు.

**సూ॥ కలౌ ఇదమే వైకమాత్ర సాధనమ్॥** ౨-౭

తా॥ కలిలోనిది యేకమాత్ర సాధనము.

ఈకాలములో మానవుని ఆయుస్సు చాల అల్పము. ఆతఁడు యుగముల పర్యంతము తపస్సు చేయఁజాలఁడు. కఠోర తపస్సునకు శరీరమాగజాలనంతటి శారీరక దుర్బలత పెరిగినది. రెండు మూఁడు నెలల ఉపవాసము మృత్యువాతఁ బడవేయును. ఎన్నడు స్వప్నములోనైన వీర్యపతనము కాని వానికే హఠయోగములోని ప్రాణాయామాసనములద్వారా సమాధి ప్రాప్తింపఁగలదు. లేకున్న స్నాయు వికృతిచే శరీరము రోగము కలదగును. కాగడా వేసి వెదకినను నేఁడా

కష్టుఁడైన నిష్ఠావాఁడు దొరుకఁడు. విచారయోగము లేక రాజయోగమున కుపయుక్తమగు స్థిరమనస్సు, తీక్ష్ణబుద్ధి జనసమాజములో వెదకిన నొకఁడు, అది దొరికిననేమో లేక పోయిన నదియులేదు. లయయోగమునకుఁ గూడ ఆహార శుద్ధియు, స్థిరమనస్సు చాల ఆవశ్యకము. నేఁడు హవనము చేయుటకు శుద్ధఘృతము దొరుకుటయే అసంభవమగుచున్నపుడు శుద్ధమగు తేనె, శుద్ధమగు చక్కెర దుర్లభమగుచున్నపుడును, పోనీ ఒక వేళ సులభమైనను ఒక్కసారిగా హవనమునకై రెండు మూఁడు శేర్ల నేయి కొనుటకే నరములు విరుగుచున్నప్పుడు ఇంక గొప్పగొప్ప శాస్త్రీయ యజ్ఞయాగాదులు చేయునదెవరు? వానికి శుద్ధమగు సామగ్రియు, నంతటికి ద్రవ్యము ఎక్కడి నుండి వచ్చును? ఉపాసనలో నైనను భగవంతునకు భోగము, పూజాదులకు శుద్ధ పదార్థములు, ధనము కావలెను. ఈ రెండును నేఁడు మనకడ లేవు. ఒక వేళ సాధన యెవరి దగ్గఱనైన నున్నప్పటికిని శాస్త్రజ్ఞుఁడును, సవిధి కర్మకాండను యోగమును ఉపదేశించు గురువు లభించుట నేఁడసంభవము. శాస్త్రాభ్యాసము కూడ సులభము కానంతటికి వివాదయుక్తముగ శాస్త్రములున్నవి. ఈ విధముగ పరమార్థసాధనములెన్ని కలవో అవన్నియు నీ యుగములో నసంభవములుగ నున్నవి. నేఁటి కాలపు దరిద్రుఁడు చంచల చిత్తుఁడు, శాస్త్రజ్ఞాన శూన్యుఁడు, నానారోగగ్రస్తుఁడు నగు దుర్బల మానవుఁడు భగవన్నామము బలుకుట కంటె నింకేమి జేయగలఁడు. ఈ ఘోరకలికాలములో వాని

ఆధ్యాత్మికోన్నతికి నామసంకీర్తన మొక్కటియే యేకమాత్ర సాధనమై ఉన్నదది.

సూ॥ సాంసారిక కామనా పూర్తిరపిచ॥ ౨-౮

తా॥ సాంసారిక కామనా పూర్తియు నగును,

భగవన్నామము కేవలము పారమార్థికమున కేగాని దానివలన నీ లోకములో నేయుపయోగమును లేదనుమాట లేదు. నామము చింతామణి. ఏకోరికతో దాని నాశ్రయించి నప్పటికిని అది అవశ్యము పూర్ణమగును. రోగములు పోవుటయు, నింక నిట్టివే. ఇతరకార్యములు నెఱవేరుటయు ఇవి కీర్తనము ద్వారా సంభవించుట చూచుచున్నాము. విశ్వాస పూర్వకముగ సంకీర్తన చేసిన దుస్సాధ్యమగు కోరికలు కూడ పూర్తికాఁగలవు.

ఉదాహరణము:— కామనా సిద్ధి కొఱకు.

శ్లో॥ కామః కామప్రదః కాంతః కామపాల స్తథా హరిః।
ఆనందో మాధవశ్చైవ కామ సంసిద్ధ యోజ్జపేత్॥

"కామః, కామప్రదః, కాంతః, కామపాలః, హరిః, ఆనందః, మాధవః అనునామములు జపించిన కోరికలు సిద్ధించును."

శత్రువును జయించుటకు:—

శ్లో॥ రామః పరశురామశ్చ నృశింహో విష్ణు రేవచ!
విక్రమశ్చైవమాదీని జప్యాన్యరి జిగుషిభిః॥

శత్రువును జయింపఁగోరువారు రామః, పరశురామః, నృసింహః, విష్ణుః, విక్రమః మొదలగు నామములను జపించవలయును.

విద్యాప్రాప్తికి:—

శ్లో॥ విద్యాఽభ్యస్యతా నిత్యం జప్తవ్యం పురుషోత్తమః

పురుషోత్తమనామమును జపించుచు నిత్యము విద్యనభ్యసింపవలెను.

బంధ విముక్తి చెందుటకు:—

శ్లో॥ దామోదరం బంధగతో నిత్యమేవ జపేన్నరః॥

బంధగతుఁడగువాఁడు దామోదరనామమును నిత్యము జపింపవలెను.

నేత్రభాధలు తొలఁగుటకు: —

శ్లో॥ కేశవం పుండరీకాక్ష మనిశం హి తథా జపేత్
నేత్రబాధాసు సర్వాసు॥

సమస్త నేత్రభాధలను కేశవ, పుండరీకాక్ష నామములను నిరంతరము జపింపవయును.

భయ నివారణమునకు: —

"హృషీకేశం భయేషు చ"

భయములందు హృషీకేశ నామమును జపింపవలయు.

ఔషధమునకు:—

"అచ్యుతం చామృతం చైవ జపేదౌషధ కర్మణి"

అచ్యుత, అమృత అను నామములను ఔషధకర్మ లందు జపింపవలెను.

యుద్ధ ప్రస్థానము చేయు సమయమున:—

"సంగ్రామాభిముఖే గచ్ఛన్ సంస్మరేదపరాజితమ్"

అపరాజిత నామమును సంగ్రామాభి ముఖమునకుఁ బోవుటకు స్మరింపవలెను.

గ్రహపీడ తొలఁగుటకును, అతివృష్టి నివారణార్థమునకు:—

శ్లో॥ నారాయణం సర్వకాలం క్షుత్ప్రస్ఖల నాదిషు ।
గ్రహ నక్షత్ర పీడాసు దేవ బాధాసు సర్వతః ॥

అతివృష్టియందును, గ్రహనక్షత్ర దేవ బాధాదులందు సర్వకాలములందును నారాయణ నామమును జపింపవలయును.

చోర, వైర నిరోధమునందును, వ్యాఘ్రాది సంకట నివారణమందును:—

"అంధకారే తమస్తీవ్రే నరసింహ మనుస్మరేత్"

తీవ్రమైన అంధకార భయమందు నరసింహ నామమును జపింపవలయును.

అగ్నిచేఁ గాల్పఁబడినప్పుడు:—

'అగ్నిదాహే సముత్పన్నే సంస్మరేత్ జలశాయినం'

అగ్నిదాహమప్పుడు జలాశాయిని స్మరింపవలయును.

సర్పాది జంతువుల వలన రక్షణ బొందుటకు:-

"గరుడధ్వజానుస్మరణా ద్విషవీర్య వ్యపోహతి"

గరుధ్వజ నామమును సంస్మరించిన విషవీర్యము నశించును.

పుత్రప్రాప్తికి:-

"జగత్పతి మపత్యార్థం స్తువన్ భక్త్యా న సీదతి"

పుత్రసంతానము కోఱిన భక్తితో జగత్పతిని స్తుతింప వలయును.

అభ్యుదయమునకు:-

"శ్రీశం సర్వాభ్యుదయికే కర్మ ణ్యాశు ప్రకీర్తయేత్"

అభ్యుదయకర్మ లన్నిటిలోను శ్రీశ నామమును కీర్తింపవలయును.

అరిష్టములందు:-

"అరిష్టేషు హ్యశేషేషు విశోకం చ సదా జపేత్"

సమస్తములైన అరిష్టములందును విశోకుని నామ మును సదా జపింపవలయును.

రోగనివారణమునకు:-

శ్లో॥ అచ్యుతానంత గోవింద నామోచ్చారణ భేషజాత్
నశ్యంతి సకలా రోగాః సత్యం సత్యం వదామ్యహమ్॥

అచ్యుత, అనంత, గోవింద అను నామోచ్చారణమను మందుతో సకలరోగములు నశించునని ముమ్మాటికి చెప్పు

చున్నానని ధన్వంతరి చెప్పెను. నామము సర్వశక్తిమంత మైనది. దానికి సమస్తమును ప్రసాదించు శక్తి కలదు.

సూ॥ ఇత్థం చేత్ దురుపయోగః॥ ౨—౯
తా॥ ఇట్లు చేయుట దురుపయోగము.

భగవన్నామము ద్వారా సాంసారిక సంబంధమగు సమస్తకోరికలు నెఱవేరినప్పటికిని నామమును తుచ్ఛపదార్థములు కొఱకు చేయుట గొప్పదురుపయోగము చేయుటయే యగును. ఈ భోగములు నరకములోఁగూడ ప్రాప్తింపఁగలవు. మానవజన్మమును బొందియు మనము హీటినే ఆరాధించుచుండిన యెడల మనకు, నరక కీటకములకు భేద మేమున్నది? మానవజన్మముయొక్క ముఖ్యోద్దేశ్యము దీనిద్వారా మనము జననమరణ చక్రమునుండి బయటపడుటయే. మాయాబంధమునుండి బయటపడుటకిదియే సమయము. భగవన్నామము మనల నీబంధమునుండి వదలించుటకు సమర్థమై యున్నది. దాని నాశ్రయించి మనము మానవ జీవితము యొక్క పరమలక్ష్యమును బొందవచ్చును. ఇట్టి సర్వ సమర్థమగు శ్రీహరినామమును తుచ్ఛభోగములకై వినియోగించు నెడల నింతకంటె దురుపయోగమింకేమి యుండఁగలదు? చక్రవర్తిని ప్రసన్నునిగావించి గుప్పెడు శనగలడిగినను, కల్పతరువు, కామధేనువు దగ్గఱకు వెళ్ళి రెండు నూకలన్నము, చింపుల పేలికను యాచించుట యెంతటి అజ్ఞానమో! రత్నములకు బదులుగా రాళ్ళ మార్చుకొనుట యెంతటి మూర్ఖ

తరయో, చందనమును తగులబెట్టి స్నానమునకు నీరుకాచు కొనుట యెంతటి దురుపయోగమో అట్లే భగవన్నామము ద్వారా ప్రాపంచిక భోగముల నర్థించుటయు నగుచున్నది.

సూ॥ ప్రభుప్రేమ ఏవ ప్రాప్యమ్॥ ౨-౧౦.

తా॥ ప్రభుప్రేమయే ప్రాప్యము.

భగవన్నామము ద్వారా పొందదగిన పదార్థమేదైన నున్న యెడల నది యీ యఖిలేశుని ప్రేమయే. భగవద్దర్శనము, ముక్తి, ఆప్రేమ సమ్ముఖమున దుచ్ఛములు.

శ్లో॥ యదిభవతి ముకుందే భక్తిరానంద సాంద్రా
విలుఠతి చరణాగ్రే మోక్షసామ్రాజ్యలక్ష్మీః॥

ముకుందుని పాదములందు ఆనందసాంద్రమగు భక్తి గల్గునెడల మోక్షసామ్రాజ్యలక్ష్మి అతని చరణాగ్రము లందు పొరలుచుండును. భగవంతునందు సాధకునకు ముక్తిని చాలసులభముగ నొసగును. దర్శనమునుండ చాలసులభముగ నొసంగవచ్చును. కాని భక్తి-అవిచలప్రేమను మాత్రము చాల కఠినతతో నిచ్చును. ఏలననగా నాతడు ప్రేమనుబట్ట వశుడగును. ప్రేమ యొకసర్వేశ్వరునినిగూడ శాసనము చేయగలదు. ప్రభువేమి చెప్పినాడో చూడుడు...

"అనువ్రజామ్యహం నిత్యం పూయేయేత్యంఘ్రిరేణుభిః"

"భక్తుల పాదరజముద్వారా నేను పవిత్రుడనగుటకై గాను నేనుభక్తుల వెనువెంట నెల్లుచుందును."

చివరకు సర్వేశ్వరుఁడుకూడ తనను ప్రేమికి అర్పణ మగునంతటి శక్తిగలిగిన పదార్థము ప్రేమకంటె నింకేమి కలదనెను. ఈప్రేమ యొక్కటే ప్రాప్యమైనది. ఈప్రేమను ప్రాప్తించుటకే మన మీమాంసనజన్మనెత్తినది. నామము యొక్క పవిత్రాశ్రయమును గ్రహించి మన మా ప్రేమధనుని పరమపావన ప్రేమయొక్క ఒక్కకృపాకణమును మనకు ప్రసాదింపవలయునని ప్రార్థించుట యొక్కటే మనకు కావలసినది.

ద్వితీయాధ్యాయము సమాప్తము

—:o:—

# సంకీర్తన మీమాంస

## తృతీయాధ్యాయము

సూ॥ సత్సంగాద్రుచిః॥ 3—౧

తా॥ సత్సంగము వలన రుచి కలుగును.

చాలమంది 'నామములో రుచి కలుగుట లేదు. ఉజ్జ వేయుచున్నది' అనుచుందురు. నిజమునకు నామమాహాత్మ్యము తెలియని వానికే యీ విచారము కలుగుచుండును. వస్తు మహాత్మ్యము తెలియనంతవఱకు, అది యెంతటి యుపయోగకరమగు వస్తువైనంగానిండు అది ఆకర్షింపబడదు.

'జానే బిను న హోఇ పరతీతీ।'

'తెలిసికొనక ప్రతీతి కలుగదు.' ఈ ప్రతీతికి, రుచికి యుద్గమము మనము దాని మహాత్మ్యము తెలిసికొన్నప్పుడు కలుగును. మహాత్మ్యమును తెలిసికొనుటకు ఒక్కటే యుపాయము. ఆ మహాత్మ్యమును తెలిసినవారి దగ్గఱకు వెళ్ళి వారి వలన వినుట. భక్తికి ప్రథమోద్గమము సాధు సంగము.

'ప్రథమ భగతి సంతన కర సంగా' ప్రథమభక్తి సాధు సంగమము. అది అయిన తర్వాత 'దూజీ రతి మమ

కథా ప్రసంగా!' రెండవది నాయొక్క (భగవంతుని) కథా ప్రసంగము నందు రతి కలుగుట.

సచ్ఛాస్త్రములు లేక నామమాహాత్మ్యమును జెప్పు గ్రంథముల నధ్యయనము చేయుట కూడ సత్సంగము లోనికే వచ్చును. నామమునందు రుచికలుగుటకు మునుముందుగా వీలుండిన నామమాహాత్మ్యమును దెలిసిన మహాపురుషుల సాంగత్యము చేయవలయును. వీలుకాకుండిన మిగిలిన కాలములో నామమహిమా ప్రతిపాదకములగు గ్రంథాదుల పఠన పాఠనము, మననము మొదలైనవి చేయవలయును.

సూ॥ సాధు, నామ, నామినా మభేదత్వాత్॥ 3—౨

తా॥ సాధువు, నామము, నామి [భగవంతుని]కి భేదము లేదు.

ఆర్ష శాస్త్రము లన్నిటియందును సంత, సత్సంగమహిమతో నిండియున్నది. నిజముగ నెవఁడైనయథార్థమగుసంత మహాపురుషుఁడు దొరకి, మనము సౌభాగ్యవశముచే వానిని గుర్తుపట్టఁగలిగిన యెడల అట్టివాని సాంగత్యమొక్క క్షణమైనను అమోఘమే, యెన్నటికిని వ్యర్థముకాదు. యేలననఁగా నిది చాల కఠినము.

'మహత్సంగో దుర్లభో, అగమ్యో, అమోఘశ్చ'

నారదభక్తి సూత్రము

నిజమగు సంత మహాత్ముని సాంగత్యము దుర్లభము. ఎవఁడో అదృష్టవంతుఁ డిట్టి సు అవసరమును

పొందఁగలుగును. ఒక వేళ సాంగత్యము లభించినను 'ఈతఁడు సంతమహాత్ముఁడు' అనునది అగమ్యము. సాధువులు స్వతః తమ స్వరూపములను దాఁచి యుంచెదరు. సాధువేషములతో మోసగాండ్రే యిష్టము వచ్చినంతమంది దొరకుదురు. కావున నిజమగు సాధువును గుర్తించుట చాల కఠినము. ఒక వేళ గుర్తించినను తప్పించుకొనిపోవును.

"భగతిభగత్ భగవంత గురు, చతుర నామ వపు ఏక్"

"భక్తి, భక్తుఁడు, భగవంతుడు గురువు వీని పేర్లు నాలుగు గాని శరీర మొక్కటే.

సాధువులు సాధనకు ఘనీభూతమూర్తులుగ నుందురు. వారు నామమునకు సాక్షాత్స్వరూపులు. వారి కృపాలేశము మానవునినిమిషములో సాధన పరాకాష్ఠ కందించును. సాధ్యవస్తువు (భగవంతుఁడు) ఆతని వెనుక 'గోవు వెంటఁ దగులు కోడె భంగి' వెంటాడుచుండును. సాధువు భగవంతుని రెండవమూర్తి.

"తస్మిఁస్తజ్జనే భేదా భావాత్"

భగవంతునకు, ఆతని వారికి భేదము నామమాత్రమునకుఁగూడ లేదు. సాధువు సాధన సాధ్యములకు, నామమునకు నామికి ఏకాకారమూర్తి. నిజమైన సాధువు దొరికెనా ఇంకఁ బొందవలసినదియు, చేయవలసినదియు నుండదు. దేనిని పొందవలసియుండునో దాని నాతఁడే యొసంగును, చేయవలసినదేదియో చేయును.

సూ॥ దుస్సంగః ఘాతుకః॥ 3—3

తా॥ దుస్సంగము ఘాతుకము.

సత్సంగమెట్లు లాభప్రదమో, దుస్సంగమంత యధికమగు హానికారకము. దుస్సాంగత్యము వలనఁగలిగిన సంస్కారములు జన్మజన్మాంతరముల వఱకు జీవుని కుమార్గముపై పునకుఁ బ్రేరేపించుచుండును. చెడ్డసంస్కారమే కొంచెముగ హృదయము మీఁదపడినను అది వేరు పాతుకొనును.

"తరంగాయితా అపీమే సంగాత్సముద్రాయంతి"

నారదభక్తిసూత్రములు

ఈకామక్రోధాది వికారములు నిరంతరము క్రియలలో తరంగమువలె లఘువుగనున్నను దుస్సంగమునుబొంది సముద్రమువలె ప్రబలమగును. గోస్వామి తులసీదాసు వారి మాటలతో—

"కోన కుసంగతి పాఇ నసావా"

దుస్సాంగత్యము వలన నెవఁడు నాశముకాఁడు!

మంచి సాధకుఁడు నిష్ఠావంతుఁడగు వ్యక్తికూడ దుస్సాంగత్యమునకు లోఁబడి దాని ప్రభావముచే చండాలుఁడుగనైన నుండఁజాలడు. కావున నామానురాగము కలవాఁడు దుస్సంగమునకు చాలదూరముగ నుండవలయును. దుస్సంగములోఁగల హానిని గమనించియే మర్యాదాపురుషోత్తముఁడగు రాముఁడిట్లు చెప్పినాఁడు—

"వరు భల బాస నరక కర తాతా।
దుష్ట సంగ జని దేఇ విధాతా॥ 3-3

దుష్టసాంగత్యము చేయుటకంటె నరకవాసముచాలమేలు.

సూ॥ శాస్త్రమర్యాదా పాలనీయా॥ 3—4

తా॥ శాస్త్రమర్యాదను పాలింపవలెను,

దుస్సాంగత్యమును వీడుటయేగాదు, దానికి తోడుగా శాస్త్రీయ మర్యాదలనుగూడ ధ్యానమునందుంచుకొనవలయును. శాస్త్రము సాక్షాత్తుగ భగవంతుని స్వరూపము. పురాణకథాది అవసరములందు పుస్తకపూజ భగవద్బుద్ధిచే జరుగుచుండును. శాస్త్రాజ్ఞ భగవదాజ్ఞయే. భగవానుఁడేమి చెప్పినాఁడో చూడుఁడు—

శ్లో॥ యః శాస్త్ర విధిముత్సృజ్య వర్తతే కామకారతః।
న స సిద్ధిమవాప్నోతి న సుఖం న పరాం గతిమ్॥ గీత•

శాస్త్రవిధిని వదలి స్వేచ్ఛ యనెడు తనయిష్టమువచ్చినట్లు వ్యవహరించువానికి తన యుద్దేశ్యము సిద్ధింపదు. వాని కెప్పుడును విఫలతయే సంభవించు చుండును. వాని కెన్నడును సుఖము లభింపదు. వానికి పరమగతియు లభింపదు.

శ్లో॥ "తస్మాచ్ఛాస్త్రం ప్రమాణం తే కార్యాకార్య వ్యవస్థితౌ।
జ్ఞాత్వా శాస్త్ర విధానోక్తం కర్మ కర్తు మిహార్హసి॥" గీత॥

కార్యాకార్య నిర్ణయమునందు నీకు శాస్త్రమే ప్రమాణము. శాస్త్రములోఁ జెప్పఁబడిన విధానములను దెలిసికొని నీవు కర్మ చేయవలయును.

శాస్త్రవాక్యము భగవదాజ్ఞ. దాని నుల్లంఘించుట భగవదాజ్ఞ నుల్లంఘించుటయే. భగవద్భక్తుఁ డెన్నటికిని తన యారాధ్యదైవముయొక్క ఆజ్ఞ నుల్లంఘింపఁగోరఁడు. భక్తునకు ప్రభుని యిచ్ఛను పరిపాలించుటయే పరమానందము, ఉత్సాహకారణము కాఁగలదు. ప్రేమికి ప్రియతముని ఆజ్ఞను బాలించుటకంటె నింకొకటి ఆనందకరమైన విషయ ముండఁబోదు. వానికి దానిలో నసౌకర్యమును దోఁచదు, కష్టము తోఁచదు.

భగవంతుని బ్రసన్నము కావింపఁ దలఁచువాఁడు ఆపరమ ప్రభుని ఆజ్ఞోల్లంఘన మేల చేయఁగోరును. మనము ఎవరి నామము నైనఁ బ్రేమతోఁ గీర్తించి, యశోగానము కావించి, ఆయనను బూజించి, ఇట్లన్నియుఁ జేయుచున్నప్పటికిని ఆయన ఆజ్ఞలను బాలింపక యుపేక్షించినచో మన కీర్తనమును మనపూజను ఏమన వలయును? వాటి ద్వారా ఆయన యెన్నటికైనఁ బ్రసన్నుఁడు కాఁగలఁడా?

ఇదే విధముగఁ గీర్తన పూజనములను జేయుచుఁగూడ మన మాప్రభుని శాస్త్రీయ ఆజ్ఞలను బాలింపకున్నచో నది యొక విధమగు ఆయనకుఁ జేసిన అవమానమే కాఁగలదు. ప్రతిప్రేమి భక్తుఁడు ప్రమాదకారణమున నిట్టి ప్రభుని అవమానమునుండి తప్పించుకొనవలయును.

కర్తవ్య విహితమైన స్వవర్ణాశ్రమాచారముగ నడచుచు నామ జపాదులుచేయుట ఉపయుక్తము. సంధ్యా,

తర్పణ, యజ్ఞ, శ్రాద్ధ కథా, పూజా పారాయణ ప్రభృతి మొదలగు శాస్త్రీయ మర్యాదలను బూర్ణముగఁ బాలింప వలయును. నామ నెపమున శాస్త్రోల్లంఘనము చేయుట నామాపరాధము. 'నామకీర్తన చేయుదును. ఇదియే సంధ్య పూజా శ్రాద్ధాదులెవరు జేయుదురు? కీర్తన జేయుదును, ఇట్లు శాస్త్రీయ కర్మవిధిచోట కీర్తనను జేయుట మంచిది కాదు. 'ఈపనివలన నేమగును అపవిత్రమగును, కొంచె మప రాధము జరుగును. తర్వాత కీర్తన జేసిన పవిత్రము చేసి తీరునుగదా' యని యెన్నటికిని పొరపాటుననైనఁ జేయరాదు. శాస్త్రీయ ఆజ్ఞలు సమస్తావస్థలందు ననుల్లంఘనీయములు. అందఱు సావధానముగ వాటిని బాలించుట ఆవశ్యకము.

సూ॥ నచే త్పతనమ్॥ 3-౨

తా॥ లేకున్నఁ బతనము కలుగును,

నామము పేరట శాస్త్రీయవిధుల నుపేక్షించువాఁడు నామాపరాధమును జేసినవాఁడగు చున్నాఁడు. నామాప రాధకారణమున వాని నామకీర్తనము లేక జపము ఏమి ప్రభా వమును బ్రకటింపదు. పైగా శాస్త్రీయవిధిని ఉల్లంఘించిన పాపము కలుగును. దేవర్షి నారదుఁడుకూడ యిట్లే చెప్పినాడు.

"అన్యథా పాతిత్యా శంకా"

శాస్త్రీయవిధి నుల్లంఘించుటచే పతన శంక కలదు. ప్రేమావేశమున విధిజ్ఞాపకము లేకున్న నది వేఱు విషయము. ప్రేమోన్మత్త భక్తునినుండి విధు లూడిపోవును. శరీరస్మృహా,

యితర ఆవశ్యక కార్యములు గుర్తుంచుకున్నంత వరకు విధులను త్యాగము చేయరాదు. విధి త్యాగ ప్రవృత్తి ఆలస్య (సోమరి తనము) కారణమునఁ గలుగును. ఈ యాలస్యము మనస్సు లోఁ దమోగుణమును, జాండ్యమును, వృద్ధికావించును. అది సాధకుని సాత్త్వికతనుండి భ్రష్టుని గావించును. ఆలస్యము కాక విధి భంగమునకు రెండవ కారణము భ్రమ. దానికి మనస్సులో నెన్నడును దావీయరాదు.

**సూ॥ ఆనుకూల లోక, వేద, విప సేవనీయ్యః॥ 3-౬**

తా॥ అనుకూల లోకము వేదము సేవనీయము.

భక్తిలక్షణములను జెప్పుచు దేవర్షి నారదుఁ డిట్లు చెప్పినాఁడు.

"తస్మిన్ అనన్యతా తద్విరోధిషూదాసీనతా చ"

నారదభక్తిసూత్రము

ఆ పరమ ప్రేమాస్పద ప్రభువునందు అనన్యతయు, దానికి విరోధభావములందు ఉదాసీన చిత్తముతోడను నుండ వలయును. ఆ విరోధభావములందు ప్రేమయును నుండరాదు, ద్వేషమునుండరాదు. అనన్యతా విశ్లేషణము కావించుచు దేవర్షి యింకను జెప్పుచున్నాఁడు.

"అన్యాశ్రయాణాం త్యాగో అనన్యతా"

ఆ ప్రభువు తప్పితే యితర ఆశ్రయాధారముల సన్నిటిని విడుచుటకు అనన్యత అని పేరు. దీనినే యింకనొకరముగ స్పష్టీకరించుచు నిట్లు చెప్పెను:-

'లోకే వేదేషు తదనుకూలాచరణం తద్విరోధిషూదాసీనతా॥'

అనన్యత యనఁగా లౌకికాచారము లందును, వేద శాస్త్రాదివ్యాజ్ఞ లందును తన సాధన మార్గమునకు అనుకూల ముగ నుండునవియు, తన నిష్ఠను వృద్ధిఁబొందించునవియు, హృదయమును శుద్ధముఁ గావించునవియు నగు విధుల నాచ రింపవలయును. వీనికి విరుద్ధములగు వాటియం దుదాసీనముగ నుండవలయును.

ఇక్కడ ఒక్కటి స్మరణయం దుంచుకొనవలయును. దేవర్షి యగు నారదుఁడు విరోధియగు లౌకికాచారములను, శాస్త్రీయ ఆజ్ఞల యెడలను కేవలము ఉదాసీనముగ నుండవల సినదనియే చెప్పియుండెను. అతఁడు వాటిని ద్వేషింపుమనియుఁ జెప్పలేదు, విరోధించుమనియుఁ జెప్పలేదు; ఏలననఁగా నవి వ్యర్థములు లేక హానిప్రదములు కావు. అధికారి భేదముచే వాటి వలనఁగూడ ఉపయోగముకలదు. ఒక ఉచ్చ అధికారి కవి యుపేక్షణీయములు కావచ్చును గాని అంతకంటె నిమ్న అధికారకదియే యుపాస్యము కూడ కావచ్చును. ఉచ్చసాధన ముల ననుసరింప సమర్థుఁడు గాని అధికారి, ఆతని అధికారాను సారముగ సాధనాశ్రయమును గ్రహించి ఉన్నతి చెందఁగలఁడు.

శాస్త్రములలో నధికారభేదముచే సమస్త విధము లగు నాజ్ఞలు కలవు. ఒక్కొక్కప్పుడు ఒకే అధికారి కీయఁ బడి రెండాజ్ఞలలోఁగూడ పరస్పరవిరోధము కలుగుచుండును. ప్రహ్లాదునికి పిత్రాజ్ఞాపాలనము, భగవద్భక్తి యీ రెండాజ్ఞ లకు విరోధము కలదు. ఇట్లే అధికారి భేదముచే బలిదానాదు లను గూర్చిన ఆజ్ఞలుకూడ శాస్త్రములలోఁ గనఁబడుచున్నవి.

శాస్త్రములలోనివి కాక పరంపరాగతములగు లోకాచారములు, కులాచారములు కూడ కలవు. ఎట్లనగా దక్షిణదేశములో మేనమామ కూతురను పెండ్లి చేసుకొందురు. కాల ప్రభావమున నీ లోకాచారములలో నిట్టివికారములు కూడ తుమ్యములు కానివి వచ్చుచుండును. ఒక్కొక్కప్పుడు ఒకానొక సమాజము యొక్క లోక, కులాచారములు సాధకునకు విరుద్ధములగును. ప్రహ్లాదునకే దైత్యులయొక్క కుల లోకాచారములు, శివోపాసన, నారాయణద్వేషము అనుకూలము కాలేదు. ఇట్టిసమస్త పరిస్థితులలో తన నామ నిష్ఠకు, భక్తికి బాధకములగు శాస్త్రవిధానములు, సాధనవిఘ్న కరములగు లోకాచారములు ఉపేక్షణీయములు. వాటిని ఉల్లంఘించుట వలన దోషమేమియు లేదు. నామానురాగమును వృద్ధి చేయునవియు, మనస్సును పవిత్రము కావించునవియు, జీవనమును సంయతముగను సదాచార మయముగ నొనర్చునవియునగు కేవలము అట్టి లోకాచార కులాచారములను, శాస్త్రీయ విధులను పాలనము చేయవలయును.

సూ॥ న దీనానాం సముపేక్షణమ్॥ 3-8
తా॥ దీనుల నుపేక్షించుట తగదు.

శాస్త్రములలో భగవంతుని అనాథనాథ, దీనబంధు, అశరణ శరణ పతితపావన మొదలగు సహస్ర విశేషణము లీయబడినవి. భాగవత కారుడిట్లు చెప్పినాడు.

“శ్లో॥ జన్మైశ్వర్యశ్రుతశ్రీభి రేధమాన మదః పుమాన్ ।
నైవార్హత్యభిధాతుం వై త్వాం అకించన గోచరః॥”

జాతి, విద్యా, తపస్సు, లక్ష్మి గర్వముచే గర్వితులైన వారు నీనామమును బలుకుట కధికారులు కారు. ఏలననఁగా నీవు దీనులకే దర్శనమిచ్చెదవు.

ఇట్టిస్థితిలో దీనుల నుపేక్షించువాఁడు, పతితుఁడై పశ్చాత్తాప తప్తుఁడగు వ్యక్తి సేవకించుకొనువాఁడు భగవత్కృపా ప్రాప్తినిజెంద నాశింపఁజాలఁడు. దీనులను శోషింపఁజేసి, వారి కష్టములకు కన్నులు మూసికొని చేసిన యే సాధనమైనఁ గానిండు, అది యుగముల పర్యంతము చేయఁబడిన యజ్ఞము కానిండు, యోగముకానిండు, కీర్తనకానిండు, తపస్సు కానిండు, ఏమైనఁ గానిండు వ్యర్థము. దీనబంధువు దీనుల నుపేక్షించు వారల యెడల నెన్నటికిని ద్రవింపఁడు; వారి పూజను అంగీకరింపఁడు. శాస్త్రవాక్యమేమనఁగా:-

శ్లో॥ బ్రాహ్మణః సమాదృక్ శాంతో దీనానాం సముపేక్షకః।
చ్యవతే బ్రహ్మ తస్యాపి భిన్నభాండాత్పయో యథా॥

సమ దర్శియు, శాంత బ్రహ్మజ్ఞాని అయినప్పటికిని దీనుల నుపేక్షించువాఁడగు నెడల వాని బ్రహ్మజ్ఞానము పగిలి పోయిన కుండలోని నీటివలె నష్టమైపోవును.

కావున నెవనిలో నిజముగ భగవంతుని బ్రాప్తించుటకే కొంచెమైన నిచ్ఛకలదో, ఎవనిలో భగవన్నామము నెడ లేశమాత్రమైన ననురాగము, రుచియుఁగలదో వాఁడు దీనుల నుపేక్షింపఁ జాలఁడు. అట్లు చేయునెడల వాని హృదయము కంపించును.

సూ॥ సేవైవ ధర్మః ॥ 3-౮
తా॥ సేవయే ధర్మము.

దీనులసేవ కంటె మించిన పుణ్యకార్య మేమియు నుండజాలదు. అన్నిటికంటె గొప్ప భగవత్పూజ ప్రాణిమాత్రసేవ. ప్రభువు స్వయముగ ప్రాణిమాత్రుసకు మిత్రుండు. "సుహృదం సర్వభూతానాం" గీతలోనాయన దీనిని స్పష్టముగ నంగీకరించియుండెను. సేవయొక యోగము. అన్నిటి కంటె మహత్వపూర్ణమగు యజ్ఞము. త్యాగ వైరాగ్యము లందఱకు సంభవములుకావు. కాని సేవ అందఱును జేయం గలుగుదురు. యెక్కడ యే పరిస్థితులలో నున్నప్పటికిని నీవక్కడ నుండియే సేవనారంభింపవచ్చును. నామానురాగి కేదైన స్వధర్మమున్న యెడల నది "ప్రణమేద్దండవద్భూమా ఆశ్వచాండాల గోఖరాః కుక్కను, చాండాలుని, గోవును, గాడిదను భూమిమీదబడి సాష్టాంగ ప్రణామము కావించుట ప్రణామమున కర్థము విస్తృత, అది కేవలము శరీరముచేం బూర్ణము కాదు. దానిలో సేవయందు ఉత్కంఠేచ్ఛయు, హృదయములో లోలోన సేవకుండనను భావనయు, నున్నప్పుడే అది పూర్ణతచెందును. నామ ప్రేమి ప్రాణిమాత్రుని యొక్క నిస్స్వార్థ సేవయే తన స్వధర్మముగ భావించును.

సూ॥ సర్వేషు భగవద్బుద్ధి స్స్యాత్॥ 3—౯
తా॥ అన్నిటిలో భగవద్బుద్ధి యుండవలయును.

ప్రాణులన్నియు భగవంతుండును, మన ఆరాధ్య స్వరూపులను భావము కలుగునంతవఱకు మనము ప్రాణిమాత్రులకు

నిజమైన సేవ చేయఁజాలము. ప్రభువు స్వామి హనుమంతునకు భక్తియొక్క వాస్తవిక స్వరూపమును జెప్పెను సిట్లనెను:—

''సో అనన్య జాకే అస మతి నటరై హనుమంత।
మైఁ సేవక, సచరాచర రూప రాశి భగవంత॥

మనము విశ్వమును విశ్వరూపమునఁ జూచినయెడల మన అహంకారము మనలను నమ్రుల కానీయదు. అందఱి యెడల నమ్రుల మగుట అంతవఱకసంభవము. నమ్రత లేని చోట సేవ యెట్లు సంభవించును. వస్తుతః ఈ విశ్వము భగవంతుని విరాట్స్వరూపము. ఈరూపములలో మన యిష్టదేవుఁడే క్రీడించుచున్నాఁడు. మనము మనస్సులో నేర్పడిన మలముచే భేదభ్రమమును దూరము కావించి యీ యనేక రూపములందు వ్యాప్తమైన యీ భూగర్భగోపాలుని గుర్తించవలయును. అట్లు గుర్తించిననాఁడే సమస్త రూపములందును కూడ సేవ చేయకుండఁ జాలము.

సూ॥ నస్యాత్ పాపమ్॥ 3—౧౦
తా॥ పాపముండఁ జాలదు.

మనలో శారీరక స్వార్థమున్నంతవఱకు, మనము ప్రపంచమును భగవద్రూపమునఁ జూడక విషయరూపమునఁ జూచినప్పుడే మనకు పాపము కలుగును. భగవద్దర్శనము, జ్ఞానములేక భక్తియొక్క ప్రాప్తిస్థితిని బొందుట చాల యుచ్చస్థితి; కాని మనము నిజముగ విశ్వమును భగవద్రూపకముగ హృదయములో బాగుగాఁ దెలిసికొనినయెడల నింక

మానవునకు పాపముండదు. పాపమున్నంత వఱకు మనము బాగుగా నీ నానా రూపములతోనున్న ప్రభువును గ్రహింప లేదని గ్రహింపవలయును. ఇంకను నామము మీఁద యథార్థముగ రుచి కలుగలేదనవలెను. సేవాధర్మాచరణ మింకను కావింపలేదనవలెను. మనము ప్రపంచమును ప్రభువుగఁ జూడఁ గలిగిన నింకఁ బాపమునకుఁ దావెక్కడిది? నిజమగు నామానురాగి దగ్గఱకు పాపము చేరలేదు సరిగదా వానికి కోసుల దూరములో నుండును.

తృతీయాధ్యాయము సమాప్తము.

—:o:—

# సంకీర్తన మీమాంస

## చతుర్థాధ్యాయము

**సూ॥ యశః ప్రతిష్ఠా సాధనం పాపమ్॥** ౪—౧

తా॥ యశః ప్రతిష్ఠలు సంపాదించుకొనుటకుఁ జేయుకీర్తనము పాపము,

నామాపరాధమునఁ దాను యశస్వి కావలెనను ప్రయత్నము చేయుటయు, మహాత్ముఁడగుటయు, లోకులతోఁ బరిచయము పొందుట మొదలగు స్వార్థ సాధనము ఆడంబరముతోఁ గూడినది. ఈ విధమగు నాడంబరము సాధకుని మనస్సును బాహ్యమునకు ప్రవృత్తి కావించి, అతనిని పతనము కావించును. కీర్తనపరులు గొప్పవారి యెదుట, గొప్ప యుత్సవములందు కీర్తనచేయ నుత్సహించుచుందురు. ఇది వారి విషయములో గొప్ప విశేషమనుకొందురు. ఇదంతయు నెందులకు? వీరిలో యశః ప్రతిష్ఠా వాంఛ ప్రబలముగనున్నది. ఈ వాంఛ యింత చెడ్డదని చెప్పపనిలేదు. దీనిమూలకముగ రాగ, ద్వేష, ఈర్ష్యాసూయలుఁ ఇంకననేకములగు దుర్వాసన లుత్పన్నములగును. సమస్తపాపములకు మూలము యశః ప్రతిష్ఠేచ్ఛ. నామ మొకవిధముగ ప్రభుని ఆహ్వానించుట, దాని నీవిధమగు ఆడంబరమున నుపయోగించుట మహాపాపము,

శ్లో॥ తృణాదపి సునీచేన తరోరపి సహిష్ణునా।
అమానినో మానదేన కీర్తనీయో సదా హరిః॥

గడ్డిపోచకంటె హీనుఁడననియు. వృక్షముకంటె నోరుపు తోడను, అవమానమును జెంది గౌరవించియు హరిని సదా కీర్తింపవలయును.

సూ॥ నిరాడంబరత్వ మపేక్షణీయమ్॥ ౪—౨

తా॥ నిరాడంబరత్వ మలవరచుకొనఁ దగినది.

నామకీర్తనము సంసారమహారోగమునకొక ఔషధము-వ్యర్థముకాని యౌషధము. కాని ఔషధ మౌషధమే. మనము దానికి తోడుగా అనుపాన సంయమముల కావింప కున్న మహాగుణకారియగు నౌషధముకూడ బలహీనమగును. నామమునకు తోడుగా ధర్మాచరణము లేకపోయిన యెడల నెవఁడును నామాపరాధమునుండి తప్పించుకొనఁజాలఁడు. నామాపరాధము కావించిన నామ మంతగాఁ దన ప్రభావమును బ్రకటింపదు. నామమువలనఁ బూర్ణలాభము పొందనలెననినవాఁడు జీవితమును నిర్మించుకొనవలెను. శారీరక సౌందర్య రచన, ఆడంబరము, షోకు ఇట్టి జీవితము మానవుని విలాసిని గావించును. దానిలో వాసనా ప్రాబల్యముండును. దానివలన మానవుఁ డధఃపతన మార్గమును నిర్మించుకొనును. సమస్త విధములగు బాహ్యాడంబరమును వదలవలయును. వేషభూషలు, వ్యవహారము, గృహము, వాక్కు, మొదలగువాని యన్నిటి యందును నిరాడంబరత్వ ముండవలయును. ఎక్కడ వెదకినను

ప్రాప్తించుటకు జీవితమును విశుద్ధము కావించుకొనవలయును. కేవలము నిర్మల హృదయమునందే విశుద్ధప్రేమ ప్రాదుర్భావమగును. మన ఇంద్రియ ప్రవృత్తులు బాహ్యముగ నున్నంత వఱకు జీవితము శుద్ధముకానంతవఱకు హృదయశుద్ధత యెక్కడిది? అంత వఱకు ప్రేమ యెక్కడిది? కావున నామనిష్ఠ ప్రాప్తింపవలయుననినఁ దన యింద్రియములను సంయమము కావింపవలయును. జీవితమును సదాచారము కావించుకొనవలయును. సాధన యేదైనఁ గానిండు యోగమునకు ఆరంభసాధనములగు యమ, నియమ ఆసనాదులన్నిటిలో వ్యాపకములే. పదినిమిషములైనఁ గూర్చుండ లేనివాఁడే కార్యమును జేయఁగలఁడు? సాధనకొఱకు శరీరమందు స్థిరత్వము కావలయును. ఈస్థిరత ఆసనమువలనవచ్చును. ఇట్లే మనస్సుస్థిరముకానిది యేసాధనము చేయుటయు నసంభవము. రాజస తామస భోజనము చేయువాఁడు మనస్సును స్థిరముగనుంచఁజాలఁడు. విలాసములో వికారములు కలుగును. అక్కడ సాత్త్వికత యెక్కడిది? పొట్ట ఊపిరాడకుండ నింపినచో నిద్రవచ్చుట తప్పదు. కొంచెమైన కష్టసహిష్ణుత లేనివానికి శీతములోఁ గంబళమును, అగ్నిని ధ్యానించును, వేసవిలో వీవన చింత యుండును. మనస్సు శరీరము విషయమున నిశ్చింతమగునప్పుడును, బాహ్యవిషయము నందాసక్తి లేనప్పుడును సాధన సాగును. బాహ్య సాధనములను సమకూర్చుకొని మనస్సును శరీరము నుండి ఒక్కక్షణముసేపు నిశ్చింతము కలుగఁజేసికొనిన నది స్థాయీ స్థితికాదు. పరిస్థితులలోఁ గొంచెమ గఁ బరివర్తనము జరిగినా మరల

గడబిడ బయలుదేరును. మనస్సు శరీరమునుండి పృథక్కుగ నిశ్చింతముగ నుండుటయే చాల అవసరము. దానికి శరీరము మీఁద నాసక్తి లేనప్పుడిది కలుగును. యమనియమాచరణము సాధకుని యీస్థితిలోనికిఁ దెచ్చును. ఆసనము దానియందు స్థైర్యమొసంగును. ఈవిధముగ సంయమ సదాచారములు ఆధ్యాత్మిక జగత్తునకు ద్వారములు. ఆజగత్తులోనికి వెళ్ళ వలసి యుండిన దీనిలోనికిఁ బ్రవేశింప వలయును.

సూ॥ వైరాగ్య మనోనిగ్రహౌ అభ్యాసనియమౌ॥ ౪-౪

తా॥ వైరాగ్య, మనోనిగ్రహములు అభ్యాసనియమములనబడును.

ఇంద్రియములను సంయమనము కావించి మనస్సుద్వారా విషయచింతనము కావించుట ఒకవిధమగు వ్యసనము. విషయ చింతనము సమస్తానర్థములను దెచ్చిపెట్టును.

శ్లో॥ ధ్యాయతో విషయాన్పుంసః సంగస్తేషూపజాయతే ।
సంగాత్సంజాయతే కామః కామాత్క్రోధోఽభిజాయతే ॥
క్రోధాద్భవతి సమ్మోహః సమ్మోహాత్స్మృతివిభ్రమః
స్మృతిభ్రంశాద్బుద్ధినాశో బుద్ధినాశాత్ప్రణశ్యతి ॥

విషయధ్యానము చేయుటచే నాసక్తి, ఆసక్తివలన కామము, కామమువలన క్రోధము, క్రోధమువలన మోహము మోహమువలన స్మృతిభ్రంశము, దానివలన బుద్ధినాశము, బుద్ధినాశమువలన సర్వనాశము కలుగును.

కావున మనస్సును విషయ చింతనమునుండి విరతి చెందింపవలయును. విషయవైరాగ్యము కలుగనంతవఱకు ఇది

జరుగదు. నిరంతరము ప్రపంచముయొక్క నశ్వరతను, విషయముల దుఃఖరూపతను చింతించుటచే మనస్సు విషయవిరక్తి చెందిన నాడు అది స్వతః విషయ చింతనము చేయదు. మనస్సు నిరాధారముగ నుండదు. విషయ విరక్తి చెందియు నది కొంచెము ఒంటెమెడ చాచుచుండును. దాని స్వభావము చంచలత. అది యొకేచోట నుండజాలదు. వైరాగ్య సంపాదనము చేయుచు దానిని నామమందు లగ్నము కావింపవలయును. అది యెక్కడికి పాఱిపోయినను మరల లాగుకొని వచ్చి నామమందే స్థిరము కావింపవలయును. మనస్సు పూర్తిగా విషయములనుండి విరక్తి చెంది నామమందు నిమగ్నము చెందిననప్పుడు ప్రేమకు భూమి సిద్ధముగనున్నదని గ్రహింపవలయును. కీర్తన సమయమందు మనస్సును బూర్ణముగ నామమందే కాగ్రము కావింపవలయును. అది నామములో తల్లీనము. శరీరమును, ప్రపంచమును మఱవవలెను.

సూ॥ లజ్జా సంకోచౌ త్యాజ్యౌ॥ ౪-౫

తా॥ లజ్జా సంకోచములు త్యాజ్యములు.

సంకీర్తన సమయములో "ఇక్కడ ఇంతమంది యున్నారే కీర్తన చేయుటెట్లు?" "ఇక్కడ నాకు ఫలాని పరిచయస్థుడున్నాడే, యీతడేమనుకొనునో?" లేక "ఇచ్చట మంచి కీర్తనకారులున్నారు, వీరిముందు కీర్తన చేయుటెట్లు?" "ప్రజలందఱు ఎగతాళి చేయుదురే," అని యీవిధముగు భావనల నన్నిటిని వదలి వేయవలెను. ఇసుమంతైన లజ్జా సంకోచములను మనస్సులోనికి రానీయరాదు. కీర్తన జరుగు

చున్నంత సేపు కన్నులు మూసికొనుట అన్నిటికంటె చాల ముఖ్యవిషయము. ఎవరు వచ్చినారు. ఎవరు పోయినారు, యీ విషయమును చింతగాని, లెక్కగాని పనికిరాదు. నృత్యముచేయుట, ఎగురుట బుద్ధిపూర్వకముగఁ జేయకుండుట మంచిది. కాని స్వరమునందు, శరీరమునందు నియంత్రణము కూడ చేయరాదు. స్వభావముగ శరీరమున కేగతియైతే కలదో దానికడ్డులేకున్న అడ్డానిని లజ్జాసంకోచములచే నడ్డగించరాదు. ఆ గతిని ప్రకటించుటలో నొకవిధమగు నానందానుభవము కలుగును. ఏకాగ్రతగల బుద్ధి యందా గతి వలన సహాయము లభించును. ఏవిధమగు సంకోచము మనస్సులోనికి రానీయ రాదు. భగవన్నామము చేయుటకు లజ్జ యెందులకు? సంకోచ మెందులకు? ఎవరైన నవ్వినా నవ్వనిమ్ము. నవ్వుతో అతఁడు ఎగతాళిచేయువారి కృపకు పాత్రుఁడు, ప్రభు నామము యొక్క అపార మహిమము ఆతనికి తెలియదు.

సూ॥ న భేద భావ స్సముచితః ౪—౮

తా॥ భేద భావ ముచితము గాదు.

భగవంతుని సమ్ముఖమున జీవులందఱు సమానములే. అక్కడ జాతి, గుణ, విద్యా, సంపత్తుల గొప్పతన మేమియు లేదు. ఒకవేళ నక్కడ గొప్పవాఁడను వాఁడుండిన వాఁడు కేవలము భక్తుఁడు. సంకీర్తనములో నెవరినైన నుపేక్షించుట గాని, ఎవరినైన విశేషముగ నాదరించుటగాని మర్యాదా విరుద్ధము. ఎవఁడైన విద్వాంసుఁడుగాని, ధనవంతుఁడుగాని

వచ్చిన యెడల 'ఇటు దయచేయండి, ముందుకు దయచే యుఁడు' మొదలగునవి బొత్తుగా అనుచితము. ఎవఁడైన బీద వాఁడు ముందుకు వచ్చి కూర్చుండిన వాని నావలకు నెట్టివే యుటకూడ అపరాధమే. ఎవరైన రానిండు, ఎవరైనఁ గూర్చుండనిండు దానిమీఁద దృష్టియుంచరాదు. వచ్చిన వాఁడు వానికెక్కడ చోటుండిన, సౌకర్యముగనుండిన స్వాయ ముగఁ గూర్చుండ వలయును. 'ఈతఁడు నామిత్రుఁడు, ఈతనిని దగ్గఱచోటుకు పంపుదును' 'ఈవ్యక్తి వెనుక నేనెట్లు కూర్చుం దును' అను నీ భేదపూర్ణమగు తుచ్ఛభావనలను వదలి కీర్త నకు వెళ్ళవలెను. ఎవరైన మహాత్ములు, విశేష భక్తులు దయచేసినచో వారికి విశిష్టస్థానము నీయవలసినదే. కాని సాధారణులలో నేమియు భేదభావము చూపరాదు. అన్నిటి కంటె ముఖ్యమైన విషయము, ఎవరువచ్చినది, ఎవరుపోయినది మఱచిపోయి కీర్తనలోఁ దన్మయులు కావలెను. కీర్తనను జెప్పువాఁడు వాయించువాఁడు, లేక హారతి మొదలగు సమ యములలో నెవరినైన ముందుకు రమ్మనుట గాని వెనుకకుఁ బొమ్మనుటగాని అది దోషముకాదు. అవసరమునుబట్టి యెవరి నైన వెనుకకు ముందుకు రప్పించినది వేఱువిషయము, కాని వ్యక్తి దృష్టిచే నిట్టిభేదభావము క్షంతవ్యము కాదు.

ఇంకొక విషయము ముఖ్యమైనది కలదు. శాస్త్రీయ మర్యాద దృష్టిచే నందఱు నొక్కచోఁ గూర్చుండి కీర్తన చేయవలసినదని ఆజ్ఞాపింపరాదు. భేదభావముంచఁగూడదనిన స్త్రీ పురుషులందఱు కలిసి కూర్చుండి కీర్తన చేయుమనికాదు.

స్త్రీ పురుషులుకలిసి కీర్తన చేయుట యేస్థితిలోనైన క్షేమ్యము కాదు. ఈ విధముగ చాండాలాదులను గూడ దానిలో సమ్మిళితము కావించుట అభిప్రేతము కాదు. ఈ విషయములలో రెండు మతములు కలవు.

> యశ్చాండాలోఽపి రామేతివాచం బ్రవీత, తేన సహ
> సం వదేత, తేన సహాసం వసేత, తేన సహ సంభుంజీయాత్'
>
> అథర్వ వేదము.

'ఏ చాండాలుఁడు కూడ 'రామ' అని భగవన్నామము జేసిన వానితో మాట్లాడవచ్చును, వానితోఁ గూర్చుండవచ్చును, వానితో భోజనము చేయవచ్చును.' వైష్ణవాచార్య చరణులు దీనినే ఆదరించుచు వచ్చిరి. కాని చాల శాస్త్రములు దీనికి విరుద్ధముగ కూడ నున్నవి. లోకాచారము బొత్తుగా విరుద్ధము. కావున నస్పృశ్యులను సమ్మిళితము కానీయకుండుటయే మంచిది.

స్త్రీ లెల్లప్పుడును ప్రత్యేకముగా మండలి నేర్పాటు చేసికొని యెట్లు కీర్తించుకొనవలయునో అట్లే అస్పృశ్యులు కూడ తమ ప్రత్యేక కీర్తనమండలుల నేర్పఱచుకొనవలెను. దీనిలో హాని యేమియు లేదు, దోషమును లేదు. భేదభావ ముంచఁగూడదనిన నర్థమేమనఁగా హృదయములో నెవరిని తక్కువగ నెంచరాదనియే. సమ్మిళిత కీర్తన చేయఁగలవారు తమలో ధన, గుణాది కారణములచే నెవరికిని విశేషత నీయరాదు.

సూ॥ వినోద భావనా త్యాజ్యా ४—౨

తా॥ వినోద భావన త్యాజ్యము.

సంకీర్తన సంగీతము కాదు. అదియొక విశుద్ధ ఆధ్యాత్మిక సాధనము. దానిలో గాన, స్వర, తాళ, వాద్యాదులకు ప్రాధాన్యత నీయరాదు. మంచి గాయకునకు, అపస్వరముగల కీర్తనకారునకు భేద మెంచరాదు. వాద్యములుండిన మంచిదే. లేకుండిన నంతకంటెమంచిది. చేతులతో తాళములు వేసి కీర్తన చేయవచ్చును. అన్నిటికంటె మంచి కీర్తనము సుందరవాద్యములు, మోహక రాగమున్నది కాదు. అందఱును దమను దాము మఱచునదియే మంచికీర్తనము. శర్మస్పృహ యుండరాదు. ఒక్కొక్కఁడేడ్చుచుండవలెను, ఒక్కొక్కఁడుస్పృహ తప్పవలెను, వేఱొకఁడొకే నామమునఁ బిలుచుచుండవలెను. మఱియొకఁడు మూర్ఛపడి యుండవలెను. అందఱును దన్మయులు కావలెను.

సంకీర్తనలో పతకములు, యితర బహుమాన వస్తువులుండరాదు. ఏలననఁగాఁ బ్రేమహృదయముతప్ప నింకేమియుఁ జూడదు. మనము శ్రేష్ఠతను నిర్ణయించుచు రాగ, స్వర, తాళాదులకుఁ బ్రాధాన్యత నిచ్చుచుందుము. సంకీర్తనను సంగీతముగ నెంచెదము. మనో వినోదభావన యుండనే యుండరాదు. వినోద దృష్టితోఁ గీర్తన చేయరాదు. ముమ్మాటికిని జేయరాదు. సంగీతము మీఁద నాకర్షింపఁబడిన వ్యక్తి అధ్యాత్మ పథమున ముందుకుఁ బోలేఁడు కావున సంకీర్తనను

వినోదముగఁ జేసి యెవరినైన నాకర్షించుటవలనఁ బ్రయోజనములేదు. సంగీతము మీఁద నాకర్షింపఁబడిన వ్యక్తి యెన్నటికిని సంకీర్తనము నెఱుఁగఁజాలఁడు. వానికి కావలసినది సంగీతము, అందువలన నదిదూషిత సంగీతమువైపునకుఁగూడలాగుకొనిపోవచ్చును. సంకీర్తనయందు ప్రేమగలవారలు 'సంకీర్తనములో సంగీతముద్వారా మనోవినోదము కూడ' చేయవచ్చునను భావనను బొత్తుగా వదలివేయవలయును.

సూ॥ సంకీర్తనము మౌనమపరాధః ॥ ౪—౮

తా॥ కీర్తనములో మౌన మపరాధము.

సంకీర్తనలో శ్రోతయను వాఁడొక్కఁడు నుండరాదు. అక్కడనున్న వారందరును బలుకుచుండవలయును. అందఱు సంకీర్తన చేయుచుండవలయును. సమాజమంతయు నేదియో యొక శబ్దము చేయుచుండునెడల నక్కడ సమస్త పరమాణువులు దానివలనఁ గంపితములగును. సమస్త వ్యక్తులయొక్క స్నాయుజాలమంతయు దానివలన ఝంకృతములగును. ఆసమయమునఁ దానుగూడ బలుకుచుండుటచే స్నాయువులాఝంకారముచే నేవిధమగు దెబ్బతినవు. కాని యెవరో ఒక వ్యక్తి మౌనముగనుండినా వానిమస్తిష్కము మీఁద చాల గొప్ప ప్రభావము పడఁగలదు. వాఁడు ధ్యాన గమ్యుఁడు కాకున్న యెడల వానికి శారీరక క్షతి (దెబ్బ) కూడ కలుగవచ్చును. కోలాహల పూర్ణమగు స్థానములలో నొక విధమగు నాకులతానుభవ మందఱును గలుగుచుండును. ఒకఁడు మొదలనుండ

కూర్చుండెనా సంకీర్తనచేయు నితరులకు నది చెడ్డగఁ దోఁచును. ఇది భక్తాపరాధము. ఒకఁడు మొదలకుండ కూర్చుండెనా ఇంకొకఁడు కూడ మొదలకుండ కూర్చుండుట కిష్టపడని చును. కొందఱూరకొందురు కూడాను. ఇతరుల నీవిధముగ పుణ్యకార్యమునుండి పరోక్షరూపమున వంచితులఁజేయు అపరాధముకూడ సంభవింపఁగలదు.

సూ॥ వార్తాలాప, మధుపాన, ధూమపాన తాం
బూల సేవనాదిక మపిచ ॥ ౮—౯

తా॥ వార్తాలాపము, మద్యసేవనము, పొగత్రాగుట, తాంబూలము వేసికొనుట మొదలగు నితరానుచిత కార్యములు కూడ (అపరాధమే.)

సంకీర్తన మధ్యలో చెవులలో గుసగుసలు, వార్తాలాపములు చేయుట, ఇతరవిషయములు మాట్లాడుకొనుట, తాంబూలము వేయుట, పొగాకు, సిగరెట్లు మొదలగు వాటిని దినుట, పీల్చుట, లేక పత్ర, పుస్తకములను జదువుకొనుట, కాళ్ళుజాపి కూర్చుండుట, అమర్యాదకరముగఁ గూర్చుండుట, భగవంతుని వైపునకు వీపు చూపించుట, మధ్యగుండా లేచి వెళ్ళిపోవుట, ఇంకనిటువంటికార్యములు సంకీర్తనకు విఘ్నకారకములుగను, భక్తుల మనస్సులు కష్టపెట్టునట్లును జేయుటంత అపరాధము కేవల మూరకొనుట వలన కలుగదు. మనము సాధారణముగ ఆఫీసరులు, మహాపురుషులు, నాయకుల సమ్ముఖమున నెంతటి శిష్టాచారముగ నుందుము! ఎంత సంయతులమై యుండుము! కీర్తన యెక్కడ జరుగుచుండునో అక్క

డను స్వయముగ సర్వేశ్వరుఁడగు ప్రభువు, ఉద్ధవుఁడు, హను మానాది ప్రధాన భక్తులు దయచేయుచుందురని శాస్త్రి ములు చెప్పుచున్నవి. ఇది తెలిసియు మనము బుద్ధిపూర్వక ముగ నచ్చట అమర్యాదగ వ్యవహరించుచుండిన నింతకంటె గొప్పయపరాధమేముండును? వార్తాపత్రికలు చదువుచుండి నను, గుసగుసలాడుచుండినను, గునగున శబ్దము చేయుచుండి నను, కాళ్ళుజాపి కూర్చుండినను, వేదికవైపునకు పృష్ఠము చూపుచుఁ గూర్చుండినను, నిద్ర తూగుచుండినను ఈకార్యము లన్నియు కీర్తనకు విఘ్నములే. భక్తులకు కష్టము కలుగఁ జేయునవియే. భక్తులను వ్యథఁగలుగజేయుట గొప్ప యపరా ధములు. దానిని ప్రభువు కూడ క్షమింపఁడు. వార్తాపత్రిక చదువఁదలచినవాఁడు, మధ్యలో లేవవలసివచ్చు నెడల వాఁ డొక ప్రక్కగ వెనుకగఁ గూర్చుండవలెను. కీర్తనమునుండి లేచి తాంబూలాదులు సేవించిన తర్వాత మరల జలముతోఁ ముఖమును స్వచ్ఛము కావించుకొని కీర్తనకు రావలయును. ఒకవేళ కీర్తననుండి లేచిపోవలసివచ్చిన నెవరికిని బాధ కలుగనట్లుగ మెల్లగా లేచిపోవలయును. కీర్తన చేయువార లకు ధ్యానభంగమగునట్టియు, నాకార్యము వలన ఖేదము కలుగునట్టియు కార్యమును దేనిని చేయరాదు.

సూ॥ సంపూర్ణ శక్త్యా కీర్తనం కుర్యాత్॥ ౪—౧౦

తా॥ పూర్ణశక్తితోఁ గీర్తనము చేయవలయును.

కీర్తన సమయములో మౌనముగా నుండఁగూడదనిన జపమువలెఁ జేయుమనియు, ఉబుసుపోకకు దాటవేయుమని

కాదు. రేపటికి శక్తి నింకమిగల్చరాదు. గొంతుపోవునే స్వరము చెడిపోవునే యనుదృష్టి విడిచివేయవలెను, శరీరమును మఱచి పూర్తిశక్తితో కీర్తన చేయవలెను. శరీరము శ్రాంతి చెందినప్పుడే కీర్తనానందము కలుగును; పూర్ణశక్తితో విసువక యే కీర్తన చేయుచుండిన మనస్సు స్వతః దానియందు లయమగును. శరీరము ప్రపంచము రెండును అదృశ్యమగును. అంత నీవొక విచిత్రవిహ్వాల స్థితిలోనికిఁ బోవుదువు. కేవల మూరక కాలము గడుపుటచే మనస్సు చంచలమగును. అది తల తోక లేని యసంబద్ధ విషయములను ఆలోచించుచుండును. కేవలము కీర్తనలోఁ గూర్చుండిన నేమియగును. కన్నులు మూసికొని సంపూర్ణమగు శక్తితో నా ప్రభుని దివ్య నామముల నుచ్చరించు చుండుము. నీలో నీవు నిమగ్నుఁడవగుము.

చతుర్థాధ్యాయము సమాప్తము.

——:౦:——

# సంకీర్తన మీమాంస

## పంచమాధ్యాయము.

సూ॥ జప సంకీర్తనయోర్వైలక్షణ్యమ్॥ ౫—౧

తా॥ జప సంకీర్తనములకు భేదమున్నది.

సకామ జపములో విధివిధానముల సమూహముండును. నిష్కామ జపములోఁ గూడ సంఖ్యా, పవిత్రతా ప్రభృతులగూర్చి ధ్యానముంచవలెను. నామజపములో పవిత్రతాది బంధనములు లేకపోయినప్పటికి సంఖ్యా మాలల ధ్యానమక్కడ గూడ యుండవలెను. జపములో వాచకము, ఉపాంశువు, మానసిక భేదములు కలవు. మానసిక, ఉపాంశు జప సంబంధమున్నంతవఱకు దానికి కీర్తనతో నే సంబంధమును లేదు. వాచక జపము ఉచ్చస్వరముతోఁ జేయఁబడినప్పటికిని అది యేకాంతమున జేయవలసియుండును. విధువక మంత్రోచ్చారణము చేయవలెను. దానిలో రాగము లేక గానముండదు. సంకీర్తనము సదా ఉచ్చస్వరముతోఁ జేయవలెను. నామోచ్చారణముకాదు, సస్వర గానము కీర్తనము. అది యేకాంతమందు కూడ జరుగవచ్చును. సమూహమందింక బాగుగా జరుగవచ్చును. సంకీర్తనము కేవలము భగవన్నామము, కీర్తనలతో జరుగవచ్చును. జపము మంత్రములతోఁ

కూడ జరుగవచ్చును. నామజపము కీర్తనము రెండును జరుగ వచ్చును; కాని మంత్రములతోఁ గేవలము జపమే జరుగును. మంత్రములతోఁ గీర్తన జేయరాదు. ద్వాదశాక్షర, పంచాక్షర ప్రభృతి మంత్రముల వేటిని కీర్తనచేయుట పనికిరాదు. శాస్త్ర మట్లాజ్ఞాపింపదు. కీర్తన భగవన్నామము విషయములోనే చేయవలెను. నామము మంత్రమైనప్పటికి మంత్రములమీఁదఁ గల బంధముల కిది పరమైనది. సమూహములో నొక్క ప్రణవమునే ఉచ్చరించుట, కీర్తించుటకూడ నిషిద్ధము. దానికి బదులు 'హరిః ఓం' అనవచ్చును. నామస్వరూపము మంత్రముగాఁ జేయఁబడినప్పుడు అది కీర్తింప యోగ్యముకాదు. ఎట్లనఁగా "క్లీం కృష్ణాయనమః" లేక "రాం రామాయనమః" వీటిని గీర్తించుట మంచిదికాదు. నామకీర్తనము కేవలము నామరూపమున, నామబుద్ధిచేఁ జేయవలెను. ఏదైన మంత్రము నామస్వరూపమైన యెడల నామబుద్ధిచేఁ దానిని గీర్తింపవచ్చును. ఉదా: 'రామ' అనునది మంత్రము కూడ, నామము కూడ అగును. దీనిని నామబుద్ధిచేఁ గీర్తింపవచ్చును. జప, నామముల విషయములో ప్రధానభేదము జ్ఞాపక ముంచుకొనవలయును, జపము, నామ మంత్రముల రెంటి విషయములోఁ జేయవచ్చును. కాని కీర్తనము మంత్రమునకుఁ జేయరాదు,

సూ॥ జపాత్స్వ పవిత్రతా, సంకీర్తనాద్విశ్వ పవిత్రతాచ॥

౫—౨

తా॥ జపము తననే పవిత్రము చేయును, కీర్తనము విశ్వమునుగూడ పవిత్రము గావించును.

జప కీర్తనములకు చాల భేదమేమనఁగా జపము కేవలము తనకొఱకే యుండును. జాపకుఁడు తనశక్తిచేఁ గేవలము తన యాధ్యాత్మిక యున్నతి మార్గమందు ముందుకు పోవును. ఇఁకఁ గీర్తనము వలన సమస్త శ్రోతలు, ఆ ధ్వని వెళ్లినంత వఱకు పశు పక్ష్యాదులు, వృక్షములు, తృణములు అనఁగా జడ చేతనములన్నియుఁ బవిత్రము లగును. నామమునుయొక్క పవిత్ర ధ్వని వాయుమండలమును పావనము కావించును. దాని లాభము అఖిల బ్రహ్మాండమునకు కొంచెముగనో గొప్పగనో కలుగును. సంకీర్తన మాహాత్మ్య మీ కారణమున జపముకంటెఁ జాల నధికము.

శ్లో॥ జపతో హరినామాని స్థానే శతగుణాధికః।
ఆత్మానంచ పునాత్యుచ్చై ర్జపన్ శ్రోతౄన్పునాతి చ॥"

'తన స్థానమున హరినామమును జపించుటకంటె నుచ్చైస్వరముతోఁ గీర్తనము కావించుట నూఱురెట్లధికము. ఏలనఁగా జపము తననే పవిత్రము కావించును, ఉచ్చైస్స్వరముతోఁ గీర్తించుటచే శ్రోతలనుగూడ పవిత్రము కావించును.

సూ॥ ఉపేక్షయా కృతమపి భగవన్నామ ప్రభావకారీ. ౫-3

తా॥ ఉపేక్షచేఁ జేసిన భగవన్నామము కూడ ప్రభావకారియే.

శ్రీహరినామము నామి సర్వేశ్వరున కభిన్నమైనది. కావున దాని నే భావముతో నుచ్చరించినప్పటికిని అది కల్యాణకారియే యగును. ఈవిధమగు నామ మాహాత్మ్యము శాస్త్ర

ములలోఁ జాలకలదు. గోస్వామి తులసీదాసుగారు స్పష్ట శబ్దములతో నిట్లు చెప్పినారు.

"భావ కు భావ అనఖ ఆలస హూ
నామ జపత మంగల దిసి దసహూఁ॥"

'మంచి భావముతోఁగాని, చెడ్డభావముతోఁగాని, కోపముతోఁగాని, సోమరితనముతోఁగాని నామమును జపించిన కల్యాణ మార్గమును జూపించును.'

ఇదిగాక:—

శ్లో॥ హరిర్హరతి పాపాని దుష్టచిత్తైరపిస్మృతః।
అనిచ్ఛన్నపి సంస్పృష్టో దహత్యేవ హి పావకః॥"

కలుషిత చిత్తముతో హరిని స్మరించినప్పటికిని అది పాపములను నశింపఁజేయును. అనిచ్ఛతోఁ దాకినప్పటికిని అగ్ని కాల్చునుగదా!

శ్లో॥ పతితః స్ఖలితః భగ్నో సందష్టస్తప్త అహతః।
హరిరిత్యవశే నాహ పుమాన్నార్హతి యాతనాః॥

పడుచు, జారుచు, దెబ్బతినియు, కీటకాదులచేఁ గఱవఁబడియు, కాల్చఁబడియు, కొట్టఁబడియు నేవిధముచేనైన సరియే వివశుఁడయ్యు 'హరి' అనువాఁడు నరక యాతనను బొందఁడు.

ఈవిధముగ ననేక ప్రమాణములుగలవు. అజామిళుని కథ చాల ప్రసిద్ధమైనది. తాత్పర్యమేమనఁగా నేదియో విధ

మున నేదియో భావమున నోటినుండి వెలువడిన భగవన్నామము వ్యర్థముగఁబోదు. అది జీవునకుఁ గల్యాణమొసంగును.

సూ॥ ప్రాచీన మహాపురుషకృత నామపదాని
చాత్యంత శక్తిమంతః ॥ ౫—౪

తా॥ ప్రాచీన మహాపురుషులచే సంకలింపఁబడిన నామపదములును విశేషశక్తి కలవి.

నామమదియే, దానిశక్తియుండ అదియే కాని అది ప్రకటమగునది మన విశ్వాసమువలన. ఆ భగవన్నామమునే దీసికొని మన మేమియుఁ జేయజాలము, దానిద్వారానే ఒకానొక మహాపురుషుఁడు చచ్చినవానిని గూడ బ్రతికింపఁ గలుగును. గోస్వామి తులసీదాసు ఏ రామనామముచేఁ జచ్చిన వానిని బ్రతికించెనో, కుష్ఠరోగిని మంచివానిఁగా జేసెనో నేఁడా రామనామమును జపించు జాపకులేమియుఁ జేయఁజాలకుండిరి. విషయమేమనఁగా దీనిలో నామశక్తిపై విశ్వాసములేదు. అందువలన నాశక్తిని బొందఁజాలకున్నాము. మహాపురుషులా యపారశక్తియందు విశ్వాసముంచెదరు. కావున నా నామముచే నా యపారశక్తిని ప్రాప్తించెదరు.

ఎవరో ఒక మహాపురుషుఁడు ఏదో ఒక సాధారణ నామమును జపించుమని చెప్పెను. ఆవ్యక్తి దానిని జపించి అభీష్టమును బొందును. ఆనామమునే తనకుఁదానే యింకొకఁడు జపించిన వానికట్టి లాభము లభించదు. మహాపురుషుల విశ్వాసము ఒక్కసారి యేదైననామము యొక్క శక్తిని

జాగృతి కలిగించిన యెడల నానామము ప్రశాంతముగానే ఉపయోగకరముగ నుండును. ఏ ప్రాచీన నామములను మహాపురుషులు కీర్తించుచుండిరో, ఏ పదములను వారు ప్రేమపరిప్లుతులై గానము చేసిరో ఆ ధ్వనులలోని పదములలోని శక్తి వారి విశ్వాసము జాగృతి చెందించినది. నవీన పదములలో నా సర్వశక్తిమంతుని భగవన్నామమే యున్నప్పటికిని నూతన పదములలోఁగూడ ఆ లీలామయుని సద్గుణమే యున్నప్పటికి యింకనన్నియు నున్నప్పటికి సంపూర్ణ విశ్వాసము వాని శక్తి విషయములో లేదు. ఏ మహాపురుషుఁడైన దానివలన పూర్ణలాభమును బొందఁగలుగును. కాని సాధారణులకు ఎవరి విశ్వాసశక్తిపరంపరచేతనో వచ్చుచుండెడి నామములు. కీర్తనలు కావలెను. ప్రాచీనములగు నామములలోను, పదములలోను వాటిని ఉపయోగములోనికిఁ దెచ్చిన మహాపురుషుల విశ్వాసశక్తి విశేషముగనుండును. కావున వానిని సాధన చేయుటచే సాధారణ సాధకుఁడు అపేక్షాకృతమును శీఘ్రముగ సఫలతను బొందఁగలఁడు,

సూ॥ అఖండ కీర్తనే తాదాత్మ్యేన నామ
వ్యత్యాస కరణమ్॥ ౫—౫

తా॥ అఖండ కీర్తనములో ఆవేశము వచ్చినను ధ్వనులను మార్చరాదు.

ఒక్క ధ్వని (నామము)తోఁ జేసిన కీర్తనము వాయుమండలమందొక విధమగు కంపనము నుత్పన్నము కావించును. ఆ కంపనము మానవుని మస్తిష్కమును హృదయమును ప్రభావితము కావించి మనస్సు ఏకాగ్రతవైపున కాకర్షించును.

నామమును మార్చిన కంపన ప్రవాహము మారిపోవును. మనస్సు చంచల మగును. సమస్త ఆధ్యాత్మిక సాధనల లక్ష్యము మనోనిగ్రహము. అది సిద్ధించవలెనన్న మనస్సు నొకే లక్ష్యమందు స్థిరముగ నుంచుటకుఁ బ్రయాస పడినప్పుడే కలుగును. లక్ష్యమును మార్చిన చంచలత కలుగును. అఖండ కీర్తనముయొక్క యుద్దేశ్యము నిరంతరము నిశ్చిత సమయము వఱకు వాయుమండలమున గుంజారము నుత్పన్నము కావించుట, అదియు స్థైర్యమును ప్రభావాన్వితము కావించును. నామమును మార్చుటచే నీయుద్దేశ్యము, లాభము నశించును. ఏ వ్యక్తి కీర్తన కీర్తనములో నేనామమును చేయుచున్నాడో యను ఆవేశములోనికి వచ్చి మూర్ఛితుఁడగునో యట్టి నామమును మార్చినచో వాని తన్మయతకు విఘ్నము కలుగును. ఏ నామముద్వారా ప్రేమోద్దీపనము కలుగునో ఆనామమును ఆ వేళను శాంతించువఱకు చేయుచుండవలెను. ఆతన్మయతను భంగముచేయుట కేమియుఁ జేయరాదు.

సూ॥ సమస్త పాపక్షయో భవతి॥ ౫—౬

తా॥ సమస్త పాపములు తొలఁగును.

పాపము పూర్వజన్మకృతము, ఈజన్మలో చేసినది, తెలిసి చేసినది, తెలియక చేసినది యని నాల్గురకములుగ నుండును, పాపముయొక్క ఫలము దుఃఖము, నరకము. ఈ పాపమునుండి తప్పించుకొనవలెననినఁ బ్రాయశ్చిత్తము చేసికొనవలెను. శాస్త్రములలో పాపములననుసరించి వాటిని

బోఁగొట్టుకొనుటకు ప్రాయశ్చిత్త విధానము కూడ కలదు. కాని యొకరకమగు ప్రాయశ్చిత్తము ఒకరకమగు పాపమునే పోఁగొట్టును. ఇఁక మిగిలిన పాపములన్నియు నట్లే నిలిచి పోవును. ప్రాయశ్చిత్తమువలనఁ బాపము పోవును గాని పాప ప్రవృత్తి పోదు. హృదయము శుద్ధముకాదు. చివరకు ఫలము మరల మానవుఁడు పాపరతుఁడగును. కేవలము భగవన్నామము సమస్త పాపములతోఁగూడ పాపప్రవృత్తిని గూడ నాశముకావించును. హృదయమును శుద్ధముగను బవిత్రముగను నొనర్చును. కేవలము భక్తి శ్రద్ధలతోడనే కాదు, ఏవిధముగ నామోచ్చారణము కావించినఁ బ్రతికెని పాపములను నాశము కావించును.

శ్లో॥ సాంకేత్యం పారిహాస్యం వా స్తోభం హేలనమేవ వా।
వైకుంఠ నామ గ్రహణ మశేషాఘ హారం విదుః॥

'సంకేతనమునఁ గాని, పరిహాసమునకుఁగాని, వ్యంగముగఁగాని అవమానము చేయుటకుఁగాని పలికిన భగవన్నామము సమస్త పాపములను హరించునని తెలియవలెను.'

గీ॥ "బిడ్డ పేరు పెట్టి – పిలుచుట, విశ్రామ
కేలినైన, మిగుల – గేలినైనఁ
బద్య గద్య గీత – భావార్థములనైనఁ
గమల నయను దలఁపఁ – గలుష హరము॥

ఆంధ్ర భాగవతము.

మోక్షమును బొందుటకు అనేకానేక యోగాది సాధనములు కష్టసాధ్యములైనవని యున్ననేమి అవి భగవన్నామమంత సులభములైనవి కావు. భక్తుండు ముక్తినికోరండు. నామప్రేమి ప్రభువుయొక్క నామ ఆనంద సింధువును వదలిపెట్టి ముక్తినిగాని, పరలోకమునుగాని కోరండు. వానివద్ద మాయ యెట్లు నిలువంగలదు? ప్రకాశ మెచ్చట నిత్యముగ విరాజిల్లుచుండునో, జ్ఞానధనము ఎవని హృదయమును సర్వదా ఆలోకితము కావించుచుండునో అచ్చట అంధకారము లేక అజ్ఞానమునకు స్థానమెక్కడిది ?

శ్లో॥ భిద్యతే హృదయగ్రంథిశ్ఛిద్యంతే సర్వ సంశయాః।
క్షీయంతే చాస్య కర్మాణి తస్మిన్ దృష్టే పరావరే॥

హృదయములోని చిజ్జడ గ్రంథి భేదింపంబడును. సందేహము లన్నియు నశించును. సమస్త కర్మలు క్షయించును. ఇవన్నియుం గేవలము నా పర, అవర స్వరూపమును జూచుట తోడనే జరుగును. ఎవని హృదయములో నా భగవానుండు స్వయముగ విరాజిల్లుచున్నాడో వానికివి యెట్లుండంగలవు?

సూ॥ ప్రభుః శీఘ్ర మావిర్భూత్వా దయామయో భవతి॥ ౫-౮
తా॥ స్వామి శీఘ్రముగఁ బ్రత్యక్షమై దయామయుఁడగును.

మన యీ స్థూల చక్షుస్సులు చూడలేక పోయినఁ బోవుంగాక, కీర్తన యెక్కడ జరిగినను. ఎక్కడ నామ గుణగానము జరిగినను అక్కడ ఆ దయామయుఁ డావిర్భవముననే వచ్చును.

"సశీఘ్రమేవావిర్భవతి అనుభావయతి చ భక్తాన్"

ఆ దయామయుఁడాతఁడెను, భక్తులాయనను బిలిచిన రాకుండునెట్లు? తనభక్తులమీఁద నాతని యపార కృప సర్వదా యుండును. ప్రభువు స్వయముగ నేమిచెప్పినాఁడో చూడుము.

శ్లో॥ నాహంవసామి వైకుంఠే యోగినాం హృదయే న చ।
మద్భక్తా యత్ర గాయంతి తత్ర తిష్ఠామి నారద॥

దేవర్షియగు నోనారదా! నేను స్థాయిరూపమున వైకుంఠములో నుండను. యోగుల హృదయములలో నుండను, నాభక్తులు నా నామ గుణముల నెచ్చట గానము చేయుదురో నేనచ్చట నుందును. దేవర్షి స్వయముగ ననుభవించి చెప్పినాఁడేమనఁగా:—

శ్లో॥ ప్రగాయతః స్వవీర్యాణి తీర్థపాద ఉరుశ్రవా।
ఆహూత ఇవ మే శీఘ్రం దర్శనం యాతి చేతసా॥

పవిత్ర చరణుఁడును, మహాయశస్వియు నగు ప్రభువు తనగుణమును గానముచేయుఁగా నాతనిని పిలిచిన వచ్చినట్లుగా నాకు దర్శనమిచ్చుచుండును.

సూ॥ యోగక్షేమం స్వయం ప్రభురేవ వహతి॥ ౫-౧౦
తా॥ ప్రభువే స్వయముగ యోగక్షేమముల వహించును.

సమస్త ఆసక్తికి, వికారములకు మూలము స్వార్థము మనము మనదగ్గఱున్నది పోగూడదనియు, లేనిది లభింప

వలెననియుఁ గోరుచుందుము. భక్తుల యోగక్షేమములను నేనే వహింతునని భగవంతుఁడు చెప్పియుండెను.

శ్లో॥ అనన్యాశ్చింతయంతో మాం యే జనాః పర్యుపాసతే ।
తేషాం నిత్యాభియుక్తానాం యోగక్షేమం వహామ్యహమ్ ॥

"ఏ భక్తులు అనన్యభావముతో నన్ను చింతింతురో, ఉపాసించెదరో, నాయందు నిత్యయుక్తులగు నా భక్తుల యోగక్షేమముల నేను వహించెదను." మన కల్యాణము దేనిలో నున్నదో మన మెఱుఁగము. అది సర్వజ్ఞుఁడగు ప్రభువే యెఱుఁగును. ప్రభువు సర్వజ్ఞుఁడనియు, సర్వసమర్థుఁడనియు, దయామయుఁడు కూడ ననియుఁ, గావున నాతఁడు చేసిన నది మన మేలుకే ననియు మనము విశ్వసింపవలయును. మనము మాత్ర మాతని చరణముల నాశ్రయింపవలెను. శరీరము, సంసారరక్షణభారము మనమీఁద నేమియులేదు.

"యో నై విశ్వంభరో దేవః సభక్తాన్ కిముపేక్షతే"

ఏ ప్రభువు సమస్త విశ్వమును భరణపోషణము చేయుచుండునో ఆతఁడు తన భక్తుల నుపేక్షించునా?

శ్లో॥ చీరాణి కిం పథి న సంతి దిశంతి భిక్షాం
నైవాంఘ్రిపాః పరభృతః సరితోఽప్యశుష్యన్ ।
రుద్ధా గుహాః కిమజితోఽవతి నోపసన్నాన్
కస్మాద్భజంతి కవయో ధనదుర్మదాంధాన్ ॥"

సీ॥ కింటి గే మనవారు ♦ ఘనులు గృహస్థులై
విఫలులై కైకొన్న ♦ వెఱ్ఱితనము
భద్రాస్థులైయుండి ♦ పాయని సంసార
పద్ధతి నూరక ♦ పట్టుబడిరి
కలయోనులం దెల్ల ♦ గర్భాద్యవస్థలఁ
బురుషుండు దేహియై ♦ పుట్టుచుండుఁ
దన్నుఁగడు కర్మ ♦ తంత్రుఁడై కడపట
ముట్టఁడు భవశేత ♦ ములకు నయిన

ఆ॥ దీన శుభము లేదు ♦ దివ్యకీర్తియు లేదు
జగతిఁ బుట్టిపుట్టి ♦ చచ్చి చచ్చి
పొరల నేల మనకుఁ ♦ బుట్టని చావని
త్రోవ వెదకికొనుట ♦ దొడ్డ బుద్ధి.

ప్రపంచభక్తిం డింకొకవై పునకుఁ జూడవలసిన పనిలేదు.
మనము దృఢ నిశ్చయము చేయవలసిన దేమనఁగా:—

"బిన్నతే రఘువర సే బన్నై, బిగరైతే భరపూర్।
తులసి బౌరసతే బన్నై వా బని బే మేఁ ధూర్॥"

(శ్రీ) సీతా రాముల పరమ పావన నామమునకు జయమగుగాక॥

పంచమాధ్యాయము సమాప్తము.

ఇతి సంకీర్తన మీమాంసా సంపూర్ణః

---

శ్రీ దుర్గా ప్రింటింగ్ ప్రెస్సు, తెనాలి.

# సాధన గ్రంథ మండలి, తెనాలి.

స్థాపితము ( 1945 )

పోషక వర్గము

మహారాజపోషకులు

| | |
|---|---|
| శ్రీ బిక్కు లింగయ్యగారు | బందరు |
| ,, ఈదర వెంకటరావుపంతులుగారు | ఏలూరు |
| ,, బొంగరాల వీరాస్వామినాయుడుగారు | కాకినాడ |
| ,, యేజళ్ళ శ్రీరాములుగారు | తెనాలి |

రాజపోషకులు

| | |
|---|---|
| శ్రీ రూపాకుల శివరాంగారు | హార్బొస్ |
| ,, పాలుట్ల పాలంకయ్యగారు | గుంటూరు |
| ,, దోనేపూడి వేంకటరమణమూర్తిగారు | కంభం |
| ,, వేజళ్ళ రాఘవయ్యచౌదరిగారు | జూపూడి |
| ,, కలగర నాగభూషణచౌదరిగారు | ఏలూరు |
| ,, యస్. కె. ప్రకాశరావుగారు | తెనాలి |
| ,, స్థాసం నరసింహారావుగారు | ,, |
| ,, పులిపాటి వెంకటేశ్వర్లుగారు | ,, |
| ,, బొంతా సత్యనారాయణ, సోదరులు | ,, |
| ,, కొన్నాదుల రామస్వామిగారు | ,, |
| ,, జయంతి బుచ్చిరామశర్మగారు | ముక్త్యేశ్వరం |
| ,, పోతుకుంచి సుబ్రహ్మణ్య శాస్త్రిగారు | చావలి |

పోషకులు

| | |
|---|---|
| శ్రీ నేతి హరినారాయణగారు | తెనాలి |
| ,, త్రిపురమల్లు శ్రీరాములుగారు | ,, |
| ,, ఘట్ట జగన్నాథంగారు | ,, |

| | |
|---|---|
| శ్రీ దుగ్గిరాల సూర్యనారాయణమూర్తిగారు | తెనాలి |
| ,, పులిపాటి లక్ష్మీనారాయణగారు | ,, |
| ,, దేవభక్తుని రత్నయ్యగారు | ,, |
| ,, పరిమి వేంకటసుబ్బారావుగారు | ,, |
| ,, గట్టి లక్ష్మీనరసింహశాస్త్రిగారు | ,, |
| ,, తాడేపల్లి హరినారాయణగారు | ,, |
| ,, ప్రయాగ కృష్ణమూర్తిగారు | ,, |
| ,, పోలిశెట్టి సోమసుందరంగారు | గుంటూరు |
| ,, బెండపూడి వేంకటరాజుగారు | వాత్లేరు |
| ,, చీమలపాటి గణేశ్వరరావుపంతులుగారు | ,, |

సభ్యులు

| | |
|---|---|
| శ్రీ కోటంరాజు కృష్ణారావుగారు | తెనాలి |
| ,, ఖండ్రిక సాంబయ్యగారు | ,, |
| ,, విష్ణుభొట్ల సుబ్రహ్మణ్యశాస్త్రిగారు | ,, |
| ,, వెంపటి సూర్యనారాయణగారు | ,, |
| ,, ముక్కామల వేంకటాచలపతిరావుగారు | ,, |
| ,, కోగంటి తిరుపతయ్యగారు | ,, |
| ,, గాడేపల్లి వెంకటసుబ్బారావుగారు | ,, |
| ,, మట్టిగుంట వీరభద్రరావుగారు | ,, |
| ,, సిరిపురపు శ్రీరాములుగారు | ,, |
| ,, బలిజేపల్లి చలపతిరావుగారు | ,, |
| ,, ప్రత్తి సూర్యనారాయణగారు | ,, |
| ,, అన్నంరాజు మాధవరావుగారు | ,, |
| ,, మాదిరాజు రామదాసుగారు | ,, |

| | |
|---|---|
| శ్రీ ముదిగొండ మృత్యుంజయుడుగారు | తెనాలి |
| ,, ధారా సీతారామకృష్ణయ్యగారు | ,, |
| శ్రీ తాడేపల్లి కేశవశాస్త్రిగారు | ,, |
| ,, రామచంద్రుని నరసింహారావు | ,, |
| ,, కాజ వేంకటజగన్నాథరావుగారు | ,, |
| ,, ఆలూరు సుందరరావుగారు | ,, |
| ,, గుడివాడ హనుమంతరావుగారు | ,, |
| ,, గోనుగుంట్ల సుబ్బారావుగారు | ,, |
| ,, వడ్లమాని కామశాస్త్రిగారు | ,, |
| ,, కాజ వెంకటనరసింహారావుగారు | ,, |
| ,, ప్రొప్రైటర్సు సారథి ప్రెస్ | ,, |
| ,, అద్దేపల్లి శ్రీమన్నారాయణమూర్తిగారు | ,, |
| ,, యస్. శివరామకృష్ణన్‌గారు | ,, |
| ,, అక్కల వెంకటేశ్వర్లుగారు | ,, |
| ,, రాపినూతల నరసింహారావుగారు | ,, |
| ,, ఈదర సుందరరామయ్యగారు | ,, |
| ,, ముదిగొండ సుబ్రహ్మణ్యశర్మగారు | ,, |
| ,, పుచ్చా వెంకటకృష్ణమూర్తిగారు | దంతలూరు |
| ,, మామిడిపూడి వెంకటసుబ్బయ్యగారు | మదరాసు |
| ,, సిసిపాటి పిచ్చయ్యగారు | ఇంకొల్లు |
| ,, ఈదర సూరయ్యగారు | అయితానగరం |
| ,, ఇసుకపల్లి వెంకటసుబ్రహ్మణ్యశాస్త్రిగారు | గార్లపాడు |
| ,, పన్నాల లక్ష్మీనరసింహ్వంగారు | గుంటూరు |
| ,, పన్నాల రామకృష్ణయ్యగారు | ,, |

| | |
|---|---|
| శ్రీ జొన్నలగడ్డ వెంకటసుబ్రహ్మణ్యంగారు | గుంటూరు |
| ,, గరిమెళ్ళ వెంకటరమణ కామేశ్వరరావుగారు | గంగలకుర్రు |
| ,, దువ్వూరి వెంకటపతి సోమయాజులు జమీందారుగారు | |
| ,, గోర్తిపళ్ళయ్య పంతులుగారు (అగ్రహారం) | |
| ,, గవిని శాయన్నగారు | జంపని |
| ,, పుచ్చా శివరామకృష్ణయ్యగారు | బందరు |
| ,, రాళ్ళబండి వెంకట సీతారామశాస్త్రిగారు | ,, |
| ,, పిశిపాటి సత్యనారాయణగారు | రేపల్లె |
| ,, మద్దింశెట్టి బ్రహ్మయ్యగారు | అయినవిల్లి |
| ,, అడ్డాల నరసిహ్మంగారు | ,, |
| ,, నంబూరి సుబ్బరాజుగారు | ,, |
| ,, విళ్ళ వెంకటస్వామిగారు | ,, |
| ,, అంకం బ్రాహ్మడుగారు | కొత్తరమూడి |
| ,, మద్దిరాల వెంకటకామేశ్వరరావుగారు | కానపల్లిలంక |
| ,, సమయమంతుల నాగేశ్వరరావుగారు | ర్యాలి |
| ,, అల్లవరపు అన్నప్పగారు | ముక్తేశ్వరం |
| ,, సలాది బాపయ్యగారు | అనాతవరం |
| ,, గోర్తి వెంకట నృసింహశాస్త్రిగారు | ఇందుపల్లి |
| ,, బులుసు పాపయ్యశాస్త్రిగారు | రాజమండ్రి |
| ,, బులుసు సత్యనారాయణగారు | ,, |
| ,, శ్రీపాద రామయ్యగారు | కాకినాడ |
| ,, బులుసు వెంకటేశ్వర్లుగారు | ,, |
| ,, చెరుపు శివరామకృష్ణశాస్త్రిగారు | విజయవాడ |
| ,, నందిపాటి రామయ్యగారు | ,, |